

ప్రశాంతమైన ప్రకృతి (ఫొటో: బూరుగుల లక్ష్మణ్‌రావు)









ఛాయాచిత్ర
వారి

# మంచి మనిషి

డైరెక్టర్
కె.ప్రత్యగాత్మ

ప్రొడ్యూసర్
కె.సుబ్బరాజు

మ్యూజిక్
యస్.రాజేశ్వరరావు
టి.చలపతిరావు

వాణీ రిలీజ్

REVATHI

STUDIO Ketha

# ఉత్తరాలు

## కథలు

కొన్ని సంవత్సరాలు దీపావళి కథల పోటీలలో విషాదాంత కథలకే బహుమతులు లభించాయి (ఎక్కువ పాళ్ళు) సుఖాంతాలు హృదయానికంతగా తట్టవా ! ?

శ్రీమతి కోమలాదేవి (బెరిలి)

## వ్యాసం

ఇదివరకు 'కిలర్ ప్రపంచం' ప్రచురించడం సమంజసంగా లేదు. ఈ వారం (25—9—64) 'టర్కీలో నైట్ క్లబ్బులు' వ్యాసం, దానితోపాటు ప్రచురించిన చిత్రాలు 'సెక్స్' పత్రిక స్థాయిలో ఉన్నాయి. ఇలాంటి అసభ్య కరమైన వ్యాసాలను, చిత్రాలను ప్రచురించడం వలన పాఠకులకు పత్రిక మీది అభిమానం తగ్గుతుందేమో ! ఇక ముందు కడు జాగ్రత్తను వహించి పత్రిక స్థాయిని పెంపొందిస్తారని ఆశిస్తున్నాను.

యస్. ఎ. సుధ (గుంటూరు)

## సీరియల్ కథలు

శ్రీ వేగేశ్న పెదసోమరాజు, కొళ్లకూరు ఇలా రాశారు: పార్వతిని ఓదారుస్తూ బ్రహ్మపలికిన వాక్యాల్లో "కంసుణ్ని చంపిన కృష్ణావతారంలాగా శిష్ట రక్షణ కోసం దుష్ట శిక్షణ కోసం ఇప్పుడీ బిడ్డ అవతరించాడు" అని ఉంది. వెనుక జరిగిన కార్యాన్ని ముందు జరిగినట్లు పోల్చి చెప్పటం భావ్యం కాదు.

సమాధానం :

వినాయకుడు ఆది దేవుడన్న మాట, భాగవతం నవీన కావ్యమన్న సంగతీ నిజమే. మనకి శ్రీకృష్ణుడు తెలిసినంతగా వినాయకుడు పరిచయం కాలేదు. తెలియని విషయాన్ని అందరికీ తెలిసిన విషయంతో పోల్చి చెబుదామన్న ఉద్దేశంతోటే 'కార్యసిద్ధి'లో ఇలా చెప్పటం జరిగింది. పూర్వాపర్యాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు.

శ్రీ కె. రంగనాయకులు, పత్తేనపల్లి : ఇలా రాశారు. రావణాసురుడు పరమేశ్వరుని ఆత్మలింగాన్ని. . . గోపబాలునిచేత ఉంచి సంధ్యా వందనమునకు పోయి 'కేశవా, నారయణా. . . .' అంటూ ఉచ్చరించినట్లుగా వ్రాసియున్నారు. రాక్షస రాజు శ్రీ మహావిష్ణువునకే ప్రబల విరోధి 'కేశవా, నారయణా' అన్నాడంటే ఆశ్చర్యంగా ఉంది.

సమాధానం :

సంధ్యా వందనంలో పాఠభేదాలున్నప్పటికీ రాక్షసుల కయినా, మరెవరికయినా కేశవ నామాలు ఒక్కటే.

ముద్దా చిట్టిబాబు (మద్రాసు) ★

**గమనిక**

శ్రీ బి. రాజా, మచిలీపట్నం తమ పూర్తి చిరునామా పంపగలరు.

సం. ఆంధ్రసచిత్రవారపత్రిక.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శుక్రవారం 16—10—'64
క్రోధినామ సం॥ ఆశ్వయుజ మాస శు॥ దశమి
సంపుటము 57 సంచిక 7
స్థాపితము:
1908
*
ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
ఒక సంవత్సరం
చందా వివరాలు
ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మని, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80 ఆస్ట్రేలియా రూ. 148.20
విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1



"సదాచారసమితివంటి ఏర్పాట్లమూలంగా లంచాల మొత్తాలు పెరుగుతున్నాయంటె నమ్మండి...!"

## మనలో మాట

ఈ సంచికలో 'వనితాలోకా'నికి ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చాము! ఆంధ్రరాష్ట్ర రాజధానిలో స్త్రీలకు సంబంధించిన వ్యాసం ఒకటి కాక, సినిమారంగంలో స్త్రీ నిర్మాతలు, రాజకీయాలలో స్త్రీల వివరాలు, కుట్టుపని, నిటింగ్, వీటికి సంబంధించిన వ్యాసాలు పాఠకులకి అందిస్తున్నాము. ఈసారి 'వంట' ఏదీ ఇవ్వలేకపోయాము! శాసనసభలలో స్త్రీ సభ్యుల వివరాలు 1962 లో ఎన్నికలు ముగిసిన తర్వాత లభించిన లెక్కలమీద ఆధారపడినట్లు కనిపిస్తాయి. 'పై సభ'లలో నామినేషన్లవల్ల 1964 అక్టోబర్‌లో పరిస్థితి కొంచెం మారి ఉండవచ్చు; కాని, మొత్తంమీద శ్రీ రామలింగం సేకరించిన వివరాలు 'స్త్రీ జనోద్ధరణ - ఉద్యమం' ఎలా సాగుతోందో సూచిస్తాయని అనుకుంటున్నాము....

* * *

ఈ ప్రత్యేక సంచిక ముఖచిత్రరచన చేసినవారు శ్రీ బాపు అని వేరే చెప్పనక్కరలేదనుకొంటాము.

* * *

ఈ ఏడాది 'దీపావళి కథల' పోటీకి వచ్చిన కథల సంఖ్య మేము ఆశించిన దాని కంటే ఎక్కువనే చెప్పాలి. పాఠకుల చేతుల్లో యీ సంచిక వుండేసరికి పోటీకథల ఎన్నిక కూడా శరవేగంతో జరుగుతూ వుంటుంది.

* * *

మా పాఠకులకు దసరా శుభాకాంక్షలు!

## విషయానుక్రమణిక



శాస్త్రి, సింగ్ లు ఏదో గారడి చేయనున్నారా,
అవినీతి
కామరాజ్ మనల్ని కూడా కాపాడొచ్చు
శంకర్ నిరపరాధి - కామరాజ్
పట్నాయక్
నన్ను మింగగలవా!
అవినీతి
కైరో సమావేశం
ఒక కొండచిలువ పులిని మింగింది - వార్త
నందా
పాకిస్తాన్!
భారత్‌కే రష్యా మిలిటరీ సాయం

# నెహ్రూ విధానాల కొనసాగింపు సాధ్యమా?

**నాటి నెహ్రూ విధానాలే నేడూ కొనసాగాలన్న ఆరాటం కమ్యూనిస్టుల కెందుకు?**

ఇది పెద్ద సమస్య. . కాదు, కాదు— సమస్యలనే దారపు పోగులు దట్టంగా అల్లుకొని పోయిన సాలె గూడు. కమ్యూనిస్టుల ఈ తాపత్రయానికి ఎన్నో కారణాలున్నాయి. ముఖ్యంగా, ఈ కమ్యూనిస్టులు తమ ఉనికిని గురించే ఎంతో భయపడి పోతున్నారు. బజాలు తడుముకొంటున్న గుమ్మడి కాయల దొంగలయి పోయారు వీళ్లు. ఈ నాడు అసలులో ఉన్నది శాస్త్రి పరిపాలన. ఇంతకు క్రితం నెహ్రూజీ ఇచ్చినంత గౌరవ, శాస్త్రి ఇవ్వడనే కమ్యూనిస్టుల భయం. అంతటిలో ఆగదు— కమ్యూనిస్టుల ఈ ఆర్భాటం చాటున మరో దారుణమైన ఉద్దేశ్యం కూడా లేక పోలేదు. ఈ నాటి ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తంగా ఉన్న సంగతి రహస్యమేమీ కాదు. ఈ పరిస్థితికి బాధ్యత శాస్త్రి ప్రభుత్వానిదీ కాదు. ఆయన ప్రధానిగా పదవీ స్వీకారం చేసి కొన్ని నెలలే అయింది. అంతకు క్రితం నెహ్రూజీ అసంపూర్ణంగా వదిలి పోయిన ఆర్థిక సమస్యతోనే ఈ నాడు శ్రీ శాస్త్రి పోరాడుతున్నారు. ఇది ఇలా ఉండగా, మరోవైపు పండిట్ కె. డి. మాలవీయ, తదితర కమ్యూనిస్టులు భారీ పరిశ్రమలు 'కావాలి' అంటూ తపించి పోతున్నారు. అసలు, ఆ మాట కొస్తే, ఇంకా ఆరంభం కావలసిన భారీ పరిశ్రమలు ఏమున్నాయ్? ఏమీ లేవనే అనుకొందాం. పోతే ఈ నాడు దేశంలో వినవస్తున్న హాహా కారాలకు, అస్థిమిత పరిస్థితికి భారీ పరిశ్రమలే కారణం అంటే ఆశ్చర్యం కాకూడదు. వ్యవసాయమూ, దైనందిన అవసరాలు, పరిశ్రమలూ స్తంభించి, నష్టపడి పోతుండగా, వెంటనే ఫలసాయం ఇవ్వలేని భారీ పరిశ్రమలతో ప్రభుత్వం దాగుడుమూతలాడటం వల్ల ప్రయోజనం ఏముంటుంది? కమ్యూనిస్టు కల్లిబొల్లి కబుర్లలోను, కపట నాటకంలోనూ అంతరార్థం కూడా ఇదే. దేశమంతా అస్థిమితమై పోవాలనే ఈ మహానుభావుల ఆశ. నెహ్రూ ఆశయాలు కొనసాగాలని కేకలు వేసి, ఆర్భాటం చేయటంలో గల ఆశయమూ అదే.

కాకపోతే నెహ్రూ విధానాలకు గొడుగు పట్టవలసినవారు డాంగే, మాలవీయ గార్లా? ఈ లెక్కంగ మంతా చూస్తుంటే మొసలికన్నీటి కథలు మదిలో మెదులుతున్నాయి.

శ్రీ శాస్త్రి కూడా తాను చెప్ప దలచుకొన్నదేదో స్ఫుటంగానే చెప్తున్నారు. తన ప్రభుత్వం వెనుక నెహ్రూ విధానాలు నిశ్చయంగా ఉన్నాయని వారు ప్రకటించారు. అంతటితో ఆగలేదు. ఎటువంటి ప్రధాని అయినా, తన పూర్వీకుల అడుగుల్లోనే సరిగ్గా తన అడుగులు వేస్తూ నడవటం కష్టమని ఆయన స్పష్టీకరించారు. నెహ్రూ ఆర్థిక విధానాల్లో జరిగిన లోపాలను నేటి ప్రపంచానికి అనుగుణంగా సరిదిద్ద గలనని కూడా శ్రీశాస్త్రి విశ్వాసం కావచ్చు.

అసలే ఈ నాడు భారత ప్రధాని సమస్యల నడుమన చిక్కుకొని ఉన్నాడు. కాశ్మీర్, కేరళ, ఒరిస్సాలు జటిలమైన సమస్యలు. వలసిందెంతో ఉంది. పరిపాలనా సామర్థ్యం పెరగాలి. ఆదాయం లేని ఖర్చులు తగ్గాలి. ఈ రెండింటి కృషి జరగాలంటే, తీసికోవలసిన కనీసపు చర్య మంత్రుల సంఖ్య తగ్గింపు. ఈనాడు కేంద్రంలో 'మిడుతలదండు'లాగా ఉంది మంత్రి వర్గం. వీరిలో కొందరు ఉపమంత్రులను, సహాయ మంత్రులను ఇంటికి పంపిస్తే, అది తప్పకుండా దేశ క్షేమం కోసం తీసికొన్న చర్యే అవుతుంది.

ఏ మాట కామాట చెప్పుకోవాలి. లాల్ బహదూర్ శాస్త్రి పదవిలోకి వచ్చాక, ఆయన పనితనం వ్యక్తమవుతూనే ఉన్నది. ప్రణాళికా సంఘం పట్ల ఆయన చూపుతున్న మోతకువ సత్ఫలితాలనే సాధించాలి. నాలుగో ప్రణాళిక ముగిసేసరికల్లా అభివృద్ధికి సంబంధించిన 'కొరవలు, సరవలు' ఉండకూడదని, ఆయన పట్టుబడి ఉన్నారు.

సత్వర ఫలితాలనిచ్చే పరిశ్రమలకే ధనాన్ని

## కమ్యూనిస్టుల తాపత్రయం: లాల్ బహదూర్ శాస్త్రి సమర్థన!!

ఆయన కృషి ఫలితంగానే కాశ్మీర్ ఈ నాడు ఒక దోవకు రాగలిగింది. ఎలాగైతేనేం, ఆఖరుకు, కేరళలో కూడా గవర్నరు పాలన తప్పింది కాదు. కాంగ్రెసు ప్రముఖులు కనీసం మళ్ళీ వచ్చే ఎన్నికల నాటికైనా సద్దుమణిగి ఉంటారో, ఉండరో? ఒరిస్సాలో కూడా, మాజీ ముఖ్యమంత్రి బిజూ పట్నాయక్ ధర్మమా అంటూ ఓ పెద్ద సమస్యల తోరణం తయారయింది. కాంగ్రెసు అధిష్ఠాన వర్గం పేరు, ప్రతిష్ఠ కూడా గంగపాలు చేసిన ఖ్యాతి పట్నాయక్ గారికే దక్కటం సముచితం!. .

ఒరిస్సాకు కూడా గవర్నర్ పాలనే శరణ్యమని అనిపిస్తుంది. పట్నాయక్‌కు అప్పుడు గాని తెలిసి రాదు తన నిజస్వరూపం!

పదిహేడేళ్ల స్వతంత్ర జీవనానికే చాలామంది అలసిపోయారా అనిపిస్తున్నది! అసలు ఇంతవరకు జరిగిన దెంత గనుక? ముందు జరగవలసింది ఎంతోవుంది;

ముఖ్యంగా దేశ క్షేమం కోసం జరగవలసిం పెట్టుబడి పెట్టాలన్నారు. గ్రామాల్లో జీవుల సంగతిపై శ్రీ శాస్త్రి, యస్. కె. డే తో ఎంత తీవ్రంగా చెప్పింది పోయినవారమే చెప్పుకొన్నాం. పైగా, ఐదేళ్లకు బదులుగా, మూడేళ్లను మాత్రం ప్రణాళికా సంఘ సభ్యుల పదవీ కాలంగా నిర్ణయించాలని ప్రధాని యోచన. శ్రీ శ్రీమన్నారాయణను నేపాల్ రాయబారిగా నియామకం చేయటం కూడా శ్రీ శాస్త్రి చర్యలలో ముఖ్యమైనది.

**సమావేశాలు, చర్చలూ, రాద్ధాంతాలు జరిపి విందు భోజనాలను ఆరగించటానికి అలవాటుపడిన న్యూఢిల్లీ అధికారవర్గంలోనూ, ఆఅధికారాన్ని అంటిపెట్టుకొని వున్న పెద్దలలోను ఎంతో చైతన్యం రావలసివుంది. ఈచైతన్యం సుసాధ్యమైననాడు సామాన్యుని పేద జీవితంలో చైతన్యం రావటం అసాధ్యం కాదు.**

శ్రీకృష్ణ. ★



గంగైకొండ చోళపురం దరిని గల ఉల్‌కొట్టాయ్ దేవాలయంలోని దుర్గ.



తంజావూరుకి చెందిన అవుదాయార్ కోవెల్లోని కాళి. 12 చేతులున్నాయి!

# విజయదశమి

— 'ఉమ'

ఆడపిల్లలు బొమ్మల కొలువు పెడతారు. అమ్మమ్మల అమ్మలు, కొలువులో పెట్టుకొన్న బొమ్మలు మొదలు కొని అప్పుడప్పుడు సేకరించుకున్న మనోజ్ఞ బొమ్మలను కొలువుపెట్టి, ముత్తయిదువలను పిలిచి సంబరం పూజలు చెయ్యడం దసరా తొమ్మిదిరోజులూ జరుగుతుంది. తల్లిని మించిన దైవం లేదంటారు. అందుకే భూమితల్లి సృష్టికి కారణమైన సర్వాంతర్యామి 'శక్తి' మాత-దుర్గ, శక్తి, కాళి, లక్ష్మి ఏ రూపంలో పూజ చేసినా ఆదిశక్తినే!

దుర్గ మహారాత్రి ఉత్సవాలు కలకత్తాలో ప్రత్యేకంగా జరుగుతాయి. ఆంధ్రదేశంలో విజయవాడ నగరంలో కూడా దేవీ నవరాత్రులు కనకదుర్గాలయంలో జరుగుతాయి.

విజయదశమి చాలా కాలాలుగా ప్రశస్తి కెక్కింది.

రాక్షసత్వంపై మానవత్వం విజయం సాధించిన రోజు అదేనంటారు. రావణాసురుణ్ని సంహారించి శ్రీరాముడు లోక కళ్యాణం చేసిన రోజున.

మహిషాసురుని మర్దించి దుర్గ లోకహితవు చేసినదీ యీరోజునే.

ఉత్తర గోగ్రహణంలో శమి వృక్షంమీదనుంచి గాండీవాన్ని దింపి విజయం సాధించినది అర్జునుడ యీ రోజునే.

సరస్వతిగా శక్తిని పూజిస్తారు. దసరాలో ఆయుధాలను పూజచేసి శక్తినారాధిస్తారు యీ దసరాలోనే.

ఉత్తర దక్షిణ భారతమంతటా దసరా ఉత్సవాలు ముఖ్యంగా కలకత్తాలో దేవీ పూజలు — మైసూర్‌లో సంబరాలు - కన్నుల పండువుగా జరుగుతాయి. పిల్లలకు బాణాలు పట్టుకుని పప్పుబెల్లాలు దండుకోడం సరదా. ఆ సందర్భంలో



మహిషాసురమర్దని [మహాబలిపురంలో]



మహాలక్ష్మి దుర్గాదేవి మయూరం దరిని ధర్మపురం దేవాలయంలో గల ఈ శిల్పంలో దుర్గకి 18 చేతులున్నాయి!

వాళ్ళను సంబరంగా నడిపించిన పంతుళ్లకు కూడా శ్రమవృథా కాదు!

దసరా వేడుకలలో 'బొమ్మల కొలువు' ప్రత్యేకత. యిందులో ఆడపిల్లలదే ఎక్కువ వేడుక! ★



'విష్ణుమూర్తి' కంచువిగ్రహం మయూరం తాలూకాలోని తిరువలప్పుతూరులోనిది.

(ఫోటోలు: ఎస్. రామకృష్ణ)

పై వారమే ప్రారంభం:
## 'నేను సైతాన్ చేతుల్లో బానిసను'
యదార్థ సచిత్ర గాథ!

## సౌందర్యమునకై సౌందర్య సాధన!

# లక్మె



**ఉదయము లక్మె వానిషింగ్ క్రీమ్ రాసుకోండి...**

మరియు దినమంతా సౌందర్యముగా తయారై వుండండి. లక్మె వానిషింగ్ క్రీమ్ మీద పౌడర్ చాలా సేపటి వరకు కూడ అదుకొని వుండును. ఇందువల్ల మీ ముఖము దినమంతా అందముగాను, కోమలముగాను వుండును.

**...మరియు రాత్రి లక్మె కోల్డ్ క్రీమ్!**

మీరు విశ్రాంతిగా నిద్రిస్తారు. లక్మె కోల్డ్ క్రీమ్ వల్ల 'మేకప్' మరియు రోమ రంధ్రముల మీద వున్న ధూళి కణములు వదలిపోవును. చర్మము కొరకు ఉపయోగకరమైన మూనెలతో తయారైన లక్మె కోల్డ్ క్రీమ్ మీ ముఖచర్మమును కోమలముగాను, ప్రకాశవంతముగాను వుంచును.

ప్రత్యేక కానుక : శృంగారము, సౌందర్యము సంపాదించు కొనుటకై ఇంగ్లీషులో వ్రాయబడిన చిన్న పుస్తకమును ఉచితముగా పొందండి.
ఈ అడ్రసుకు వ్రాయండి. లక్మె లిమిటెడ్, బాంబే హౌస్, బ్రూస్ స్ట్రీట్, బొంబాయి 1.

# అందని స్నేహం

డి. కామేశ్వరి



ఆశా డియర్,

ఎన్నాళ్ళయిందో నీకు ఉత్తరం వ్రాసి! ఇంత పెద్ద ఉత్తరాన్ని చూసి ఆశ్చర్యపోతున్నావా? ఇన్నాళ్ళూ నీ ఉత్తరాలకి జవాబీయని నా అసమర్థతని మనసులో పెట్టుకొని, యిప్పుడింత పెద్ద ఉత్తరానికి కారణమేమియుంటుందానితర్కించుకుంటూంటావు అవునా?.... అయినా, అసలు వ్రాయని నా ఉదాసీనతని యిప్పుడింత వ్రాసి విసుగెత్తించే నా పొరపాటుని అర్థంచేసుకుని క్షమించగల ఔదార్యం నీకుంది.

ఈ ఉత్తరం నీకు వ్రాస్తుంటే ఒక్కొక్కటే స్పష్టంగా, మసగ్గా ఎన్నో జ్ఞాపకాలు,—వాల్తేరులో, ఇంకా వెనకాల కడపలో—ఆ రోజుల మాటలు అనుభవాలు, అనుభూతులు అన్నీ నా కళ్ళ ముందు తిరుగుతున్నాయి. ఇన్నేళ్ళ కాలాన్ని వెనక్కి తిప్పి, మళ్ళీ అలా పాంబీచ్ యిసుకలో యిద్దరం గుజ్జనగూళ్ళు కట్టుకుంటూ ఏదో పిచ్చిగ మాట్లాడుకుంటూంటే ఎంత బాగుణ్ణు! ఈరోజు ఆ కోరిక నాలో మరీ బలంగా రగుల్తోంది. ఆశా! ఒక్కసారి నువ్వు నా దగ్గరకి రాగలిగితే, ఒక్కసారి మళ్ళీ మనిద్దరం, మిగతా మనుష్యులందరికీ దూరంగా ఒకళ్ళొకరు అనుకొని కూలబడి మనసు విప్పి మాట్లాడుకో గలిగితే ....! కాని ఆ అదృష్టం లేదు. అందుకే ఈ ఉత్తరం.

వయసుతోపాటు బాధ్యతలు, వాటి నంటిపెట్టుకుని బాధలు ఎక్కువవుతున్నాయి, డియర్! ఎందుకిలా పెద్దవాళ్ళమైపోయి బాధల్ని గుణించుకుంటున్నామో అర్థంగాదు .... ఏమిటోలాగుందికదూ, యీ ఉపక్రమణ! ఏం చెయ్యమంటావు? నన్ను ముంచెత్తే ఆలోచనల ఉప్పెనలో ఏది ఏమిటో తేల్చుకుని, ముందు వెనకలు నిర్ధారించి, కాగితం మీద పెట్టడానికి తగిన వోపిక, మనశ్శాంతి నాకు లేవు నాలో అలజడి నువ్వూ కొంత పంచుకోక తప్పదు.

కొన్నేళ్ళ క్రితం. పంచరంగులవి తప్పించి నలుపు తెలుపు సాదా కలలు యెరగని 'టీనేజ్' అది! ఈ నేలకీ, నేలమీద మనుష్యులకీ, వాళ్ళ ఆలోచనలకీ ఎంతో ఎత్తు మనం, మన ఆలోచనలు, మాటలు.

ఇప్పుడు తల్చుకుంటే ఒకోసారి నవ్వొస్తుంది. కాని, అప్పుడు ఎంత ఘాటుగా చర్చించుకునే వాళ్ళం! అన్నీ మన మనుకున్నట్టే జరుగుతాయని, భవిష్యత్తు మన చేతుల్లోనే ఉందని ఏమిటో అంత ధీమా! ఉదాహరణకి చూడు. ఎంత పెద్ద చదువున్నా, డబ్బున్నా కట్నం పుచ్చుకునేవాళ్ళి పెళ్ళి చేసుకోకూడదని ప్రతి స్త్రీ ప్రతిజ్ఞ చెయ్యాలని వాదించిన నువ్వు చివరికి ప్రసాద్‌ని చూశాక .... నిన్ను చెప్పాలని నా ఉద్దేశ్యం కాదు. కాని, ఆ రోజుల్లో మనం బతికిన అవాస్తవిక వాతావరణాన్ని ఆ తర్వాతి కాలం, పరిస్థితులు మనకి నేర్పిన గుణపాఠాల్ని గుర్తుచేసుకుంటున్నాను, అంతే.

పొత్తిగా ఏమీ తెలియని అమాయక బాల్యాన్నుంచి ఇంద్రజాలంలాంటి యౌవనంలోకి అడుగుపెట్టిన క్రొత్తలో మనకి ఎదురయ్యే తెలియని అశాంతిని, శూన్యభావాన్ని, పుస్తకాల్లో చదివే అందమైన పడికట్టు మాటల్తో నింపుకుంటాం. ఏదో చెయ్యాలనే ఆవేశానికి, ఏమీ చేయలేని అశక్తతకి మధ్య నలిగిపోయే మనకి ఈ మాటలు, మహా ప్రవాహంలో కొట్టుకుపోయే చీమలకి గడ్డిపోచల్లా, ఆసరా కల్పిస్తాయి. వాటిని పట్టుకు వేలాడాలని చూస్తాం.

చివరి కవి గడ్డిపోచల్లాగే రాలిపోతాయి, ఆశా! వాటిని నమ్మి మోసపోయిన మనం క్రిందపడి, తల బొప్పికట్టాక, చుట్టూ జూసి తెలివి తెచ్చుకోవాలి. అలా నిజాయితీగా పరిస్థితులకి తలొగ్గిన నువ్వు అదృష్టవంతురాలివి. నీ జీవితం నందనవనం కాకపోయినా, ముళ్ళకంప మటుకు కాదు.

ఇంతవరకు ఇంకా ఆమాత్రం ధైర్యం, చేతకానితనాన్ని అంగీకరించగల శక్తి, నైతికబలం కుదుటబర్చుకోలేని నేను ఇలా బతుకుని సమస్యల కూడలి చేసుకొని, ఏ క్షణమే అఘాతాన్ని తెస్తుందో నన్న శాశ్వత భయంతో, ఆందోళనతో నెట్టుతున్నాను. కాని, దీనికంతకీ స్వస్తి చెప్పాలనే గాఢ వాంఛ అయితే నాకుంది. దాని కొక దారి కావాలి. అందుకు నీ సహాయం అర్థిస్తున్నాను, ఆశా!

ఇలా ఏమేమిటో చేతికి వచ్చిందల్లా వ్రాసుకు పోవడానికి, ఉచిత సహాయాలు కోరడానికి నీకన్నా ఎవరున్నారు నాకు?

ఒకవిధంగా చూస్తే ఈ పరిస్థితి కల్పించింది నువ్వే. నువ్వు కావాలని పట్టుబట్టి అలా మమ్మల్నిద్దర్నీ ఒకర్ని చెయ్యకపోతే ఈ పరిస్థితి వచ్చేది

[illegible]! అరడుగుల [illegible] [illegible] బాధ్యతా నీమీదనే వేస్తున్నాను.

ఆశా, ఆరోజు గుర్తుందా! విజయవాడ ప్లాట్ ఫారంమీద మద్రాస్ మెయిల్ ఆగింది. పట్ట పగలేమో అన్నట్లు కనిపించే ట్యూబ్‌లైట్ల కాంతి, విరామం ఎరుగని పంకాలు, టీ, పాన్ బీడావాళ్ల కేకలు, ఎక్కే దిగే జన కోలాహలం మధ్య, క్రిక్కిరిసి ఉన్న సెకండ్‌క్లాస్ కంపార్ట్మెంటు కిటికీ లోంచి అతి ప్రయాసతో తల బయటికి దూర్చి, ఎంతకూ కనబడని నిన్ను వెతుక్కుంటున్న నా కళ్లు దూరంగా స్లీపర్‌కోచ్‌నుంచి వెతుక్కుంటూ వస్తున్న నీకన్నా ముందు నీ పక్క ఆరడుగుల మనిషి మీద నిలిచాయి.

ఆ తర్వాత కాసేపటికి 'మా మరిది వేణు, స్టేట్స్‌లో హెూస్ సర్జన్—నా ప్రాణానికి ప్రాణం లీల, ఫైనల్ ఎం. బి!' మమ్మల్నిద్దర్నీ పరిచయం చేశావు. నీ నవ్వే కళ్లలో కాంతిని చూస్తే నాకు వెంటనే నువ్వేదో పెద్ద ప్లాను వేసినట్టు అనుమానం తట్టింది. అయితే నిజం చెప్పాలంటే ఆ అనుమానం ఎంతో తియ్యగా, చల్లగా, హాయిగా అనిపించిందనుకో. కాంతి చిమ్మే ఆ కళ్లు, ఎప్పుడూ నవ్వు విడనట్టుండే ఆ పెదాలు, సభ్య సంస్కారాలు ఉట్టిపడే ప్రవర్తన, ముఖ్యంగా నాకు నచ్చిన చదువు—ఆ క్షణంలో నాలో కలిగిన ఆనందోత్సాహాలకి అవి కారణాలేమో! (కొంచెం అయినా మొహమాటం లేకుండా భర్తని ఎలా పొగుడుతూందో అని నవ్వుకుంటున్నావు కదూ!) ఎందుకు చెబుతున్నానంటే ఆ కాంతి చిమ్మే కళ్లు ఇప్పుడు కోపం చికాకుతో ఎర్రజీర తెచ్చుకుంటూ ఉంటాయెప్పుడూ. ఆ పెదాలు నవ్వి ఎన్నాళ్లయిందో! ఆఖరికి ఈ చదువులు ఎందుకు చదివామా అని తిట్టుకునే పరిస్థితిలో

# అందని పూలు

ఉన్నాం ఇద్దరం. ఈ తేడాలు తెలిపేందుకే వ్రాశాను.

ఆ రాత్రి యింటికి వెళ్లాక భోజనాలు అయి ముగ్గురం డ్రాయింగ్ రూంలో ఏవో కాలేజి మాటలు చెప్పుకునేవేళ హఠాత్తుగా నువ్వన్నావు—"వేణూ, లీలతో ఇంకో అర్ధగంట మాటాడావంటే మీచేత పెళ్లి చేసుకోనని, పల్లెటూర్లో మకాం పెట్టి బీదలకి ఉచిత వైద్యం, తద్వారా దేశసేవ, మానవకళ్యాణం వగైరా చేస్తానని ప్రమాణము చేయించేస్తుంది! జాగ్రత్త!— అన్నట్టు మీరూ డిటోయే గదా! మర్చిపోయాను!" మమ్మల్నిద్దర్నీ ఒకేవాదిరి అభిప్రాయాలు, భావాలు గల వాళ్లలాగ గుర్తించుకోడానికి నువ్వు చేసిన మాటల గారడీ అది!

మర్నాడు ప్రయాణం అవుతానన్న నన్ను పట్టుబట్టి మరి రెండురోజులుంచేశావు. లేకపోతే, నీమాట ఆసరాగా నేనే ఉండిపోయానేమో! నా ఆదర్శాల సంకెళ్లు అప్పుడే క్రొద్దిగా బిట తీశాయనాలి. ఆయనని చూడాలని, ఆయన మాట వినాలని, నా ఆశయాలు, భావాలు ఆయనకి తెలియచెయ్యాలని ఏమిటో వెర్రి ఆరాటం!

ఒకరోజు రాత్రి, రేపు వూరికి వెడతాం అనగా ముగ్గురం కృష్ణ ఒడ్డుకి షికారు వెళ్లాం జ్ఞాపకముందా! ఆరోజు పూర్ణిమ. 'యెన్నెలంతా మేసి యేరు నెమరేసింది.' అన్నట్టుంది కృష్ణ. చల్లటి గాలి గిలిగింతలు పెడుతుంటే అలా మూగగా నిలబడి పోయాను. ఆ తర్వాత మీ రిద్దరూ నాచేత బలవంతంగా పాడించారు.

'ఎవరో హెూ, ఈ నిశీధి వేగిస, నీడవోలె నిలిచి, పిలుచు శెవరో, మూగకనులు మోయలేని చూపులతో ఎవరో హెూ! ఎవరో హెూ!'—నాకు మరీ నచ్చిన గేయం అందుకున్నాను. నాకే తెలియని బాధావశ్యంలో 'ఎవరో, నా హృదయనాళ మేలా తునియలుగా నా నిర్జీవపు జీవితమ్ము నిట వదలుదురో!' అని పాడుతుంటే కళ్లు చెమర్చాయి. అంతవరకు నేను గుర్తించని నాలోని భయంకరమైన ఒంటరితనం ఒక్కసారి కట్టలు తెంచుకుని పాట రూపంలో బయటపడినట్టయింది. ఆ తర్వాత ఆయన తన్మయంలోంచి తేరుకుంటూన్నట్టు కొద్ది క్షణాలు ఆగి నెమ్మదిగా 'రియల్లీ వండర్‌ఫుల్!' అన్నప్పుడు నేనే ఏ లోకాల్లో తేలిపోయానో!

'వదినా, ఈ వెన్నెల, చల్లగాలి, కృష్ణ, పాట, ఇదంతా చూస్తుంటే—' ఆయనేదో చెప్ప బోయారు.

'మిమ్మల్నీ యెవరన్నా జంటగా పడవ షికారు పోదాం రమ్మని పిలుస్తున్నారా?' నవ్వు నా ఇద్దరివంకా చిలిపిగా చూస్తూ నవ్వావు. నీ అర్థం చాలా స్పష్టంగా తెలిసిపోతూంది. నే నెంతో సిగ్గుపడ్డాను. ఆయన కూడా ముందు కొంచెం బిత్తరపోయి తర్వాత తేలిగ్గా నవ్వేసి 'మీ ఐడియా మెచ్చుకోవాల్సిందే!' అని హాస్యమాడబోయారు.

"కాస్త వెన్నెల, కొద్దిపాటి చల్లగాలి, ఒక తియ్యని కంఠం—ఆమాత్రానికే మీ నిశ్చయాలు సడలిపోతే, ఇంక మీ బ్రహ్మచర్యం, దేశోద్ధరణ ఏంకావు!" గేలిచేశావు.

"అదే ఆలోచిస్తున్నాను!" అని తప్పించుకున్నారు గడుసుగా.

మర్నాడు నన్ను సాగనంపడానికి నువ్వు పనుందని ఇంటిదగ్గర ఆగిపోయి ఆయనని పంపించావు. మే మిద్దరం కాంలో కూర్చొన్న అయిదు నిమిషాలకి ఆయన మెల్లిగా జేబులోంచి చిన్న డైరీ తీసి రెండు పేజీలు చూపెట్టారు. ఒక పేజీలో 'వదిన కుమారి లీలని పరిచయం చేశారు.' అని వ్రాసిఉంది. మరోదాన్లో 'ఇదే స్వర్గమంటే' అని రెండే మాటలు. ఆ స్వర్గం క్రితం రాత్రి కృష్ణ వొడ్డున మనం గడిపిన గంట గురించిసదని తెలుస్తూనే ఉంది.

'మీ రెలా తీసుకుంటారో తెలియదు, అయినా ధైర్యం చేస్తున్నా. నేను ఉత్తరం వ్రాస్తే జవాబిస్తారా?' అరచేతులు ఒకదానిమీద ఒకటి రాసుకుంటూ వాటికేసే చూస్తూ అన్నారు. అంత సిగ్గెందుకో అప్పుడు! ఇప్పుడు?!

ఆ తర్వాత ఆరునెలలూ మా ఉత్తరాలు యితర విషయాలతోబాటు మా ఆదర్శాలని గురించి, వాటిని నిలబెట్టుకోడం గురించి, పెళ్లి చేసుకున్నాక కూడా మనో నిబ్బరంతో, పట్టుదలతో ప్రజాసేవలో స్వార్థాన్ని వెనక్కి నెట్టి మా చదువులు సద్వినియోగ పరచుకోడం గురించీ వాగ్దానాలతో, ప్రమాణాలతో నిండిపోయాయి.

పెళ్లిరోజున ఆశీర్వదిస్తూ, ఇద్దర్నీ యెగతాళి చేస్తూ 'మీ ఇద్దరూ అప్పుడే ఒక విషయంలో వోడిపోయారు, ఇంక మిగతావి ఎంతవరకు ఆచరణలో పెడతారో చూడాలి!' అన్నావు నువ్వు. మేం ఇద్దరం మొగాలు చూసుకొని 'వోటమి అప్పుడి

45 వ పేజీ చూడండి




"ఇంతకీ ఈ సినిమాలో హంతకు లెవరో అర్థం కాలేదోయ్?"
"ఇంకెవరూ, ఈసినిమా తీసినవాళ్ళే!...జనాన్ని చంపి వదిలిపెట్టారు!"

బహుశా మీరు చెప్పలేరు...
కాని ఆమె అందములో
కొంచము లోపము వుంది!

కొంచము నిదానించి చూడండి.
ఇప్పుడు ఆ లోపములు
కనిపించుట లేదు!

మీరు ఎల్లాగ చెప్పగలరు. ఈమె తన ముఖము మీది మచ్చలను, మొటిమలను లాక్టో-కేలమైనుతో మరుగు పరుచుకొంది. లాక్టో-కేలమైను ఒక అత్యుత్తమమైన 'పౌడర్ బేస్'. దీనిని ఉపయోగించుటవలన ముఖచర్మ మందలి దోషములు మరుగు పడును. మీ చర్మము మృదువుగాను మరియు కాంతివంత ముగాను వుండును.

## లాక్టో-కేలమైను ముఖములోని మచ్చలను మొటిమలను కప్పిపుచ్చును!

లాక్టో-కేలమైనులో శీఘ్రముగా పనిచేసె ఉత్తమమైన కేలమైను వుంది. అది ముఖ చర్మమునకు చాలా లాభదాయకమైనది. దీనిని ఉపయోగించుటచే చర్మము మృదువుగాను మరియు కాంతి వంతముగాను వుండును. దీనివలన మీ సౌందర్యమధిక మగును. లాక్టో-కేలమైను ముఖము మీది మచ్చలను, మొటిమలను కప్పి పుచ్చి వాటిని తొలగించుటకు సహాయపడును.

లాక్టో-కేలమైను ముఖము మీద మొటిమలు మరియు ఎండ తీవ్రత వలన కలిగిన మచ్చలను తొలగించి వేడిగాలినుండి చర్మమును రక్షించును. చంటి పిల్లల రేగిన చర్మమును కూడా మృదువుగా నుంచును.

సౌందర్యసాధకమైన లాక్టో-కేలమైను శ్రేణికి చెందిన లోషన్ (క్రీమ్) మరియు టాల్కమ్ పౌడర్ కూడా దొరుకుచున్నవి.




లాక్టో-కేలమైను — మీ సౌందర్యసాధనము!

క్రూక్స్ ఇంటర్‌ఫ్రాన్ లిమిటెడ్, బొంబాయి 18.



చిత్రపు హనుమంతరావు

మధ్యాహ్నం రెండు గంటలు కావస్తోంది. . .

ఎండ విప్పులు చెరుగుతోంది. విద్యార్థుల పరీక్షా పత్రాలు దగ్గర పెట్టుకుని దిద్దడానికి పూనుకున్నాను. నా ప్రక్కనే కూర్చున్న శారద బాబిగాడ్ని ఆడిస్తూ మధ్యమధ్య కబుర్లు చెబుతోంది . . .

మా ఇంటి గుమ్మంలో రిక్షా ఆగడంతో శారద బాబిగాణ్ని ఎత్తుకుని ఆత్రుతతో గుమ్మం దగ్గరకు వెళ్ళడం, రిక్షాలోంచి స్త్రీ దిగడం, శారద నా వైపు 'ఎవరన్నట్లు కనుసైగ చెయ్యడం క్షణాల్లో జరిగి పోయాయి. . . ఆ స్త్రీ హడావుడిగా గుమ్మంలో ప్రత్యక్షం కావడంతో తేరపారి చూశాను.

దేశం శాంతి సౌభాగ్యాలతో తులతూగుతున్న కాలంలో. . . వినీలాకాశంలో మంద మందంగా కదలిపోయే తెల్లని పల్చటి మబ్బు తెరల వెనుక, అమాయకంగా మిణుకు మిణుకు లాడుతున్న నక్షత్రాల మధ్య, రాబోయే అనర్థాన్ని సూచిస్తూ పొడచిన తోకచుక్కలా ఇంట్లోకి అడుగు పెట్టింది కాత్యాయిని అక్కయ్య.

శారద అక్కయ్య పేరైతే విన్నది కాని, ఎన్నడూ చూడలేదు. అందువల్ల వచ్చినావిడ ఎలాంటి బంధువోనని నా వైపు బిత్తర చూపులు చూడసాగింది, ఐతే దాని బేల చూపులు గ్రహించక పోలేదు అక్కయ్య .

"ఏమే మరదలు పిల్లా. . . మరీ ఇంత నాజూగ్గా ఉన్నావు ?" అంది పలుకరింపుగా. నా వైపు చూపి "అదేమిట్రా. . . నన్ను ఎవరో క్రొత్తవాళ్ళను చూసినట్లు చూస్తోంది మరదలు ?" అంది.

అంతవరకూ 'అక్కయ్య తలపెట్టబోయే కార్యం ఏమిటై ఉంటుందా ?' అన్న ఆలోచలతో సతమత మవుతున్న నాకు శారదకు అక్కయ్యను పరిచయం చేయలేదని జ్ఞప్తికి వచ్చి.

"శారదా. . . మా కాత్యాయిని అక్కయ్య. . మన పెళ్ళికి రాలేదు వీలుపడక" అని అక్కయ్యతో "అక్కయ్యా. . మరదల్ని మొదటి చూపులో పోల్చావు" అన్నాను నవ్వడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ.

ఇంతట్లో రిక్షావాడు అక్కయ్య సామాన్లు లోపలకు చేరవేసి, డబ్బులు పుచ్చుకుని వె పోయాడు.

శారద అక్కయ్య వేసే కుశల ప్రశ్నలకు ... యుంగా సమాధానాలు చెబుతోంది కా నా దృష్టంతా ఇంచు మించు గది నంతనూ అ

మించుకున్న సామాన్ల మీదనే ఉంది. వాటిని చూస్తుంటే అక్కయ్య చాలా రోజులు ఉండటానికే వచ్చిందని స్పష్టమవుతుంది కాని, ఎలాంటి వ్యధను, చికాకును కలిగించి వెడుతుందో మాత్రం వూహకందని దయింది.

శారద బాబిగాడ్ని నా చేతులకిచ్చి వంట గది వైపు దారితీస్తుంటే "మరదలు పిల్లా. . . ఆకలిలేదు కాని, ఏదో నామకహా నాలుగు మెతుకులు" అంది అక్కయ్య.

సరదాపడి బాబిగాడ్ని నా చేతుల్లోంచి అందుకునేసరికి వాడు ఆరున్నొక్క రాగం ఆలాపించడం మొదలు పెట్టాడు, ఐతే అంతటితో నిరుత్సాహపడి, వాడ్ని నా చేతులకిచ్చివేసే రకం కాదు అక్కయ్య! వాడ్ని ఎత్తుకుని వీధి గుమ్మంలో నిలబడి వచ్చే పోయే కార్లను, బళ్లను, రిక్షాలను చూపిస్తూ వాడ్ని మరిపించి కొద్ది క్షణాల్లో మంచి చేసేసుకుంది. 'అయ్యో. . . నా మతి మండా' అంటూ లోపలికి వచ్చి, సంచీలోంచి రెండు పిప్పరమెంట్ల ప్యాకెట్లు తీసి వాడి చేతులకిచ్చింది వాడు అక్కయ్య మంచితనమేదో తనకు తెలిసి పోయిందన్నట్లు నా వైపు చూసి బోసి నవ్వులు నవ్వడం మొదలు పెట్టాడు.

మేనల్లుడ్ని ముద్దు పెట్టుకుని "ఆ ముక్కూ, విశాలమైన కళ్ళూ, బోసి నోరు, ఆ పల్చటి జుట్టు అంతా చిన్నాన్న పోలికరా" అని మురిసి పోయింది.

ఇంతట్లో శారద స్నానానికి నీళ్ళు సిద్ధం చేయడంతో ఎత్తు మడమల జోళ్ళు విప్పి, రిస్టు వాచీ తీసేసి, టవలు పుచ్చుకుని హుందాగా అడుగులు వేస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

పరీక్ష పేపర్లు కట్ట కట్టేసి అక్కయ్యను గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. అక్కయ్య వయస్సయితే ఇరవై ఎనిమిదేళ్ళు ఉంటుంది కాని, పొట్టిగా, పీలగా ఉండే అక్కయ్యకు అంత వయస్సు ఉంటుందనిపించదు.

స్నానం ముగించుకుని, జుట్టు తుడుచుకుంటూ కూని దీరాలు తీస్తూ హాల్లోకి వచ్చింది అక్కయ్య. కళ్ళకు కాటుక తీర్చి దిద్దుకుని, నుదుటిపై నయాపైసా అంత బొట్టు పెట్టుకుని, కుర్చీలో కూర్చుని బాల్యస్మృతులు నెమరు వేసుకో సాగింది.

"ఆ రోజులింక రావురా తమ్ముడూ! నువ్వు నేను కలిసి స్కూలుకి వెడుతూ దారిమధ్యలో దెబ్బలాడుకుని, మరుక్షణంలో కలసిపోతూ, అల్లరి చేస్తూ నాన్నచేత,చిన్నాన్నచేత చివాట్లు తింటూ-నా, ఆదమరచి నిద్రపోయే రోజులు మరిరావు . .. అవి చీకూ చింతా లేకుండా హాయిగా గడిపి వేసిన రోజులు. . వయస్సు వచ్చిన కొద్దీ, బాధ్యతలు మీద పడి మనశ్శాంతం లేకుండా చేస్తాయి. . ."

నేను మౌనంగా అక్కయ్య మాటలు వింటూ కూర్చున్నాను.

కాలక్షేపానికి ఆడబడుచులు లేరని వాపోయే శారదకు ఆ వెలితి తీర్చింది అక్కయ్య! ఉత్సాహంతో కూని దీర్ఘాలు తీస్తూ చక చకా వంట పూర్తి చేసి, అక్కయ్యను భోజనానికి లేవమనడంతో అక్కడితో సంభాషణ ముగిసింది. భోజనం చేసి ఆపసోపాలు పడుతూ వచ్చింది.

నిద్ర పోతున్న నాన్నగార్ని చూసి వచ్చి "బాబాయి మరీ నీరసంగా కన్పిస్తున్నాడు. ఏవైనా ఆయుర్వేదం ఔషధాలు ఇప్పించ కూడదట్రా ? జుట్టంతా ముగ్గు బుట్టయి పోయిందే" అంది బాధ పడుతూ.

నాన్నగారి వయస్సు అరవయి ఏళ్ళ పైబడిందని అక్కయ్యకు తెలియక కాదు. అదంతా నాన్నగారి మీద తన కెంత వాత్సల్య మున్నదో తెలియ బర్చుకుని మమ్మల్ని మంచి చేసుకోడానికి మాత్రమే!

* * *

సాయంత్రం అయిదున్నర గంటలకు కాఫీ ఫలహారాలు చేసి అక్కయ్యకు మేలుకొలుపు పాడింది శారద. నాన్నగారు నిద్ర లేస్తూనే కాత్యాయిని అక్కయ్యను చూసి ఆశ్చర్య పడ్డారు. అందులో వింతేమీ లేదు కని, ఆనందించారని మాత్రం చెప్పక తప్పదు.

సుడిగాలిలా వచ్చి గాలి దుమారం లేవదీసి, వెళ్లడం అక్కయ్య తీరు!

"ఏమే అమ్మాయి ..... మేము అయిదేళ్ల తర్వాత జ్ఞాపకం వచ్చామా ! " అన్నారు.

" లేదు బాబాయి ... వద్దామని ఎన్నిసార్లు అనుకున్నానో భగవంతుడి కెరుక. కాని ఉద్యోగంలో చేరాక మనం అనుకున్నట్లు ఎలా సాగుతుంది? ఉద్యోగమంటే వ్యక్తిత్వాన్ని చంపుకుని బానిస జీవితం గడపడమే కద .... ప్రకాశం పెళ్లికి రావాలని ఎంత వువిలాట పడ్డానో ... నువ్వు చేసే శుభకార్యం ఇదొకటేనని, సంబంధం నిశ్చయమయిందని తెల్పిన దగ్గర్నుండి 'ఎప్పుడు రైలెక్కుదామా ?' అన్న తహ తహతోనే గడిచి పోయాయి రోజులు.. నెల రోజులకు సెలవు దరఖాస్తు పెట్టి సామాను సర్దుకున్నాను కూడా.... ఆఖరి క్షణంలో ఆఫీసరు పిలిచి 'కాత్యాయినీదేవి ...... మీరు ఇప్పుడు సెలవు తీసుకుంటే ఎలా చెప్పండి ? అసలే పని ఎక్కువగా వుంది, పైగా మరొకరు కాన్ఫిడెన్షియల్ వర్కు చెయ్యడం నా కిష్టం లేదు.... కావాలంటే నెల తర్వాత, నెలకాదు రెండు నెలల సెలవు తీసుకోండి, నాకేమీ అభ్యంతరం లేదు ' అన్నారు.... ఆయన మాటలు విని నీరు కారి పోయానంటే నమ్ము బాబాయి ... పోనీ పెళ్లి కెలాగూ రాలేక పోయాను, తమ్ముడూ, మరదలూ చిలకా గోరింకల్లా అన్యోన్యంగా కాపురం చేస్తుంటే చూసి ఆనందిద్దామంటే ఎక్కడ ఏలూరు ? ఎక్కడ హైదరాబాదు ? "

" పోయినసారి శ్రీకాకుళంలో పని చేస్తున్నానన్నావుగా ? " అన్నారు నాన్నగారు ఆశ్చర్యపోతూ.

" ఆ వుద్యోగం వదిలేసి మూడేళ్లు దాటింది బాబాయి...." అంటూ పెట్టె తెరచి ఒక్కొక్క వస్తువే బైట పెట్ట సాగింది.

అక్కయ్య మాటలు వింటూంటే ముందర 'ప్రిపేరయి' వచ్చిందానని అన్పిస్తుంది. కాని, మాటల్లో ఇతరులను కట్టి వేసే ప్రజ్ఞ అక్కయ్యకు వుంది. మూడేళ్ల క్రితం శ్రీకాకుళం నుండి హైదరాబాదు మకాం మార్చిన అక్కయ్యకు దారి మధ్య ఏలూరులో వున్న మేము గుర్తుకు రాలేదు..... ఇప్పుడు తనకు తానై వచ్చిందంటే ఏదో విశేష ముండి వుండాలి, కాని అక్కయ్య ఆంతర్యంలో ఏమున్నదో సృష్టించిన బ్రహ్మకు కూడా తెలియదేమో !

" బాబాయి... అసలే శీతవికాలం ... నువ్వు నులితక పంచలు మోయ లేవని గ్లాస్కో పంచలు తెచ్చాను " తెరెది పరచిలి బతి చూపిస్తూ.

" ఏమిటే... నువ్వు డబ్బు దుబారా చెయ్యడం మానలేదూ ? " అన్నారు నాన్నగారు మందలిస్తూ.

" అదేమిటి బాబాయి .... నువ్వేమైనా పైవాడివా చెప్పు ? నన్ను పెంచి పెద్ద జేశావు... నాన్న ఎలాగూ లేడు ...." అంది కళ్లు వత్తుకుంటూ.

నాన్నగారు కరిగిపోయి.

" అదికాదే ... నిన్ను బాధ పెట్టాలని అనలేదు... నువ్వు కష్టపడి సంపాదించుకుని నీ పొట్ట పోసుకుంటున్నావు... నాకిప్పుడు గ్లాస్కో పంచ లెందుకు చెప్పు ? వచ్చినదంతా మంచి నీళ్లలా ఖర్చు పెట్టక నాలుగు డబ్బులు వెనకేసు కోవడం నేర్చు కోవాలి నువ్వు " అన్నారు నొచ్చుకుంటూ. అక్కయ్య నవ్వింది. నాన్నగారు ఎవరో పిలిస్తే బైటకు వెళ్లిపోయారు. ఆడుకుంటున్న బాబిగాడి దగ్గర తను తెచ్చిన ఆట సామానంతా పరచింది. 'తమ్ముడూ... మీ ఆవిడని ఇంతకు ముందు చూడ లేదుగా.. నువ్వు చామన చాయలో వుంటావు కాబట్టి, అది కూడా మంచి రంగులోనే వుంటుదన్న నిర్ధారణకు వచ్చి ఈ ముదురు ఆకుపచ్చ రంగు చీర దాని కోసం తీసుకున్నాను.... నేను వూహించిన దానికంటే అందంగానే వుందిరా మరదలు........."

" ఇప్పుడు దానికి చీర ఎందుకు అక్కయ్యా..."

నా మాటలు విన్పించు కోలేదు... పెరట్లో పూసిన మల్లె మొగ్గలు కోసి దండ గుచ్చి శారదను కూర్చో బెట్టుకుని జడ వేసి, దండంతా దాని జడలో తురిమి, సరదర్ని చూసుకుని మురిసి పోయింది. ముత్యాల దండ మెడలో వేసి, తను తెచ్చిన చీర యిచ్చి పెట్టుకు రమ్మంది. ఎదురు చెప్పలేక అక్కయ్య చెప్పినట్లు నడుచుకుంది శారద.

" మరదలు రతీదేవిలా వుందిరా ...." అంది శారదను చూసి.

ఎలాంటి చీర కట్టుకున్నా, అలంకరణ చేసుకున్నా ఎప్పుడూ రతీదేవిలా కన్పించే శారద; అక్కయ్య వేడుకగా ఇచ్చిన చీరలో మాత్రం ఆదోలా కన్పించడానికి కారణం.... చీరతోపాటు అక్కయ్య సుణగణాలు, తెలివి తేటలు, వాగ్ధోరణి సంక్రమిస్తాయని నా భయం !

వంట ప్రయత్నంలో వున్న శారదను వారించి:

" వెర్రి పిల్లా... రోజూ చేసే వంటే కదా... ఇవ్వాళ నవ్వూ తమ్ముడూ కలిసి అలా షికారు తిరిగి రండి.... బాబిగాడ్ని ఇక్కడ కూర్చో పెట్టి, ఆట సామాను దగ్గర పడెయ్యి... వెర్రి నాగన్న అల్లరి పెట్టే రకం కాదు .. తమ్ముడికి గోంగూర పచ్చడి ఇష్టం....." అంటూ వంటకుపక్రమించింది.

శారద వారించినా వినలేదు, వదినగారి మంచితనం చూసి పొంగి పోయింది శారద.!

క్షణ క్షణానికి అక్కయ్య మాటలు వింటూంటే నాకు ఆందోళన ఎక్కువవుతోంది. శారద నాదగ్గరకు వచ్చి గోముగా షికారుకు వెడదామని అర్థించేసరికి ప్రపంచంలోకి వచ్చి, ఆమెను నిరుత్సాహ పర్చడం ఇష్టం లేక బయలు దేరాను.

నేనూ, శారదా చెరువు గట్టున నిర్జన ప్రదేశంలో కూర్చున్నాం . .. సూర్యుడు పడమటి కొండల్లోకి గ్రుంకు తున్నాడు.... అరుణ కిరణాలు

## అబల అంతర్యం

సిటిపై బడి వింతగా మెరుస్తున్నాయి... చల్ల గాలి మధురాను భూతుల్ని రేకెత్తిస్తోంది.. గాలికి శారద ముంగురులు నుదుటిపై బడి దోబూచు లాడు తున్నాయి.

"ఏమండీ.... ఈ చీర ఎలా వుంది ?" అంది శారద ముంగురులను చేతో పైకెగ ద్రోసు కుంటూ.

"శారదా... నువ్వు ఎలాంటి చీర కట్టుకున్నా అలంకరణ చేసుకున్నా, అందంగానే కన్పిస్తావు."

నా మాటలకు శారద నవ్వింది విందుగా... ఆటు వైపు ఆసక్తితో చూస్తూ కూర్చున్నాను. నేల మీద వేళ్లతో పిచ్చి గీతలు గీస్తూ కొద్ది క్షణాల తర్వాత "మీ అక్కయ్యను గురించి ఎన్నడూ మాట వరుసకైనా చెప్పలేదేం ?" అంది.

"ఈ అక్కయ్య అంత చెప్పుకుని మురిసి పోయేంతటిది కాదులే..."

కొద్ది గంటల పరిచయంతో అక్కయ్య మన స్తత్వం సంపూర్ణంగా గ్రహించి వేసినట్లు "అదే మిటండీ.? అంత మంచి ఆవిణ్ని అలాగనేశారూ.." అంది మాటలు సాగదీస్తూ.

అక్కయ్య మాటల్లో తియ్యదనం ఎవరి నైనా ఇట్టే ఆకర్షించి ముగ్ధుల్ని చేస్తుంది; ఐతే ఆ తియ్యని మాటల వెనుక రాబోయే గడ్డు సమస్యలు మాత్రం వూహించ శక్యం కానివి. తియ్యని మాటలు చెబుతూ చేదు అనుభవాల్ని రుచి చూపించడంలో అక్కయ్య దిట్ట ! అనుభవ మయ్యే వరకూ ఆమె ఎటువంటిదో తెలుసు కోవడం కద్దు, కాని చేతులు కాలాక ఆకులు పట్టుకుంటే వుండే ప్రయోజనం ఏపాటిది ? తెల్లని వన్నీ పాలు, నల్లని వన్నీ నీరు అనుకునేంతటి అమాయకపు శారద అక్కయ్యంతటి మంచిదాన్ని ఇంత వరకూ చూడ లేదనే నిర్ధారణకు రావడంలో ఆశ్చర్య మేముంది ?

"శారదా ... ముఖాన్ని చూసి గాని, మాటల్ని బట్టిగాని ఒకరి మంచితనాన్ని నిర్ణయించ కూడదు. నుసి జారిన నిప్పు గుణం చెయ్యి పెడితేనే కదా తెలిసేది ! మా ఇంట్లో పుట్టి పెరిగిన అక్కయ్యను గురించి నాకంటే నాకు బాగా తెలుసు.. ముందు ముందు రాబోయే అనుభవాల వల్ల నా మాటలు ఎంత వరకూ నిజమో నీకే తెలుస్తుంది..."

నా మాటలు శారదను సంతృప్తి పరచలేక పోయినట్లు, ఆమె ముఖ కవళికలే చెప్పాయి.

*　　*　　*

రెండు మూడు రోజులు గడిచి పోయాయి... అందరితో కలివిడిగా మెలగుతూ, ఆప్యాయత ఒలక బోస్తూ ఇంట్లో మనిషై పోయింది అక్కయ్య. ఒకరోజు రాత్రి అందరి భోజనాలయిన తర్వాత, ఆరు బయట కుర్చీ లలో కూర్చున్నాం. నాన్నగారు చుట్ట వెలి గించుకుని :

"అమ్మాయీ..... ఐదేళ్ల తర్వాత వచ్చావు పోనీ మేమెవ్వరమైనా వచ్చి చూద్దామంటే నువ్వె క్కడున్నావో తెలియదు కదా... ఈసారి నువ్వు పది' పదిహేను రోజులయినా వుంటే కాని కుదరదు', అన్నారు.

అక్కయ్యకు స్థిరత్వ మన్నది లేదుగా ఒకసారి వచ్చినప్పుడు ఎలిమెంటరీ స్కూల్లో పంతులమ్మ నంది... మరొకసారి వచ్చి నప్పుడు సర్వే ఆఫీసులో 'క్లర్కు'; ఉద్యోగం చీకూ, చింతాలేని ఉద్యోగ మంది... ఇలా ఎన్నిసార్లో.... క్రిందటిసారి అమా యకపు పల్లె ప్రజకు సేవ చేస్తూ కాలం వెళ్ల బుచ్చుతున్నానని అంది. ప్రస్తుతం ఏ వుద్యోగం చేస్తోందో తెలియదు, కాని ఆంధ్ర దేశంలో అక్కయ్య ఉద్యోగాలు వెలగ బెట్టని ఆఫీసులు, పట్టణాలు బహుశా అరుదేనని చెప్పవచ్చు ! పోయిన సారి శ్రీకాకుళంలో పని చేస్తోంటే, ఈసారి హైదరాబాదులో !

"బాబాయి .... జీవితం యాంత్రికంగా గడిచి పోతోంది. ఏవూళ్లో వున్నా మనసంతా మీ మీదే... మిమ్మల్ని చూడాలని వున్నా, ఉద్యోగంలో చేరాక ఎలా వీలవుతుంది ? మీరు గుర్తుకి రాని రోజంటూ ఉండదు. క్రిందటి నెలలో రెండు మూడుసార్లు నువ్వు కలల్లోకి వచ్చావు కూడా... ఆఖరికి ఆఫీ సరుతో దెబ్బలాడి ఈవూరు 'ట్రాన్స్‌ఫర్ చేయించు కున్నాను." అంది గంభీర స్వరంతో.

చుట్టపు చూపుగా వచ్చిందనుకున్న అక్కయ్య 'ట్రాన్స్‌ఫర్' చేయించుకుని వచ్చిందని వినగానే గుండెల్లో రాయి పడింది. మంత్ర ముగ్ధయై అక్కయ్య మాటలు వింటోంది శారద.

"మంచి పని చేశావు కాత్యాయనీ .... అన్నయ్య ఎలాగూ లేడు, నిన్ను నా చేతుల్లో పెట్టి నిశ్చింతగా కన్ను మూశాడు ... కానీ నాకు నీకు నేను ఏం చెయ్య గల్గాను ? నీలో అన్నయ్యను చూసుకుంటూ కాలం గడుపుదామనుకుంటే నామాట వినక, ఉద్యోగంలో చేరి నీ బ్రతుకు తెరువు నువ్వు చూసుకుంటున్నావు.... నువ్వెక్కడ ఉంటున్నవో, ఏయేపాట్లు పడుతున్నావోనని, నా బెంగ....."

"బాబాయి.... నువ్వు చేయ గల్గింది చేశావు. నా నుదుట అలా జరగాలని రాసి పెట్టి వుంటే నువ్వేం చేయ గలవు ? "

అక్కయ్య మాటలు నా చెవులకు కృతిమంగా ధ్వనిస్తూ వుండడం వల్ల అక్కడి నుండి లేచి వెళ్లి పోయాను. తను తలపెట్టబోయే కార్యానికి ఇవి నాంది వాక్యాలు కాగల ప్రమాదం లేక పోలేదు !

* * *

అక్కయ్య డ్యూటీలో చేరి ఆఫీసుకి వెడుతుంది.. నాన్నగార్కి అక్కయ్య మీద వాత్సల్యం దిన దినాభివృద్ధవుతోంది ... శారద అక్కయ్య అవసరా లను కనుక్కుని మర్యాద చేస్తోంది, అక్కయ్య కూడా దానికి పని సాయం చేస్తోంది, అప్పుడప్పుడు బాబిగాడ్ని ఆడిస్తోంది...

ఒక రోజు దిన పత్రిక చదువుతుండగా అక్కయ్య నా దగ్గరకు వచ్చి "మీ బావను ఒకసారి రమ్మన్నానని చెప్పరా...." అంది మెల్లిగా.

ఏలూరు పట్టణంలో బావలైతే అయిదారుగురు ఉన్నారు, కాని అక్కయ్య ఏ బావను రమ్మనమని చెప్ప మంటోందో అర్థంకాక,

" ఏ బావే అక్కయ్యా...." అన్నాను.

" మీ పెద్ద బావను....."

నాకు 'ఇది కలా ? నిజమా ? ' అన్న అనుమానం రాక పోలేదు... అక్కయ్య నోటంట ఆ మాటల్ని [illegible] ఆశ్చర్యాన్ని [illegible] భావాలు చదువుదామని తల పైకెత్తి చూశాను. అక్కయ్య వెను దిరిగి వెళ్లి పోవడం వల్ల నాకు ఆ అవకాశం చిక్కలేదు !

ఆ సాయంత్రం బావ బజార్లో కన్పిస్తే చెప్పాను. 'నన్ను రమ్మందా ? ఎందుకు ? ' అన్నాడు తెల్లబోతూ.

బావ ప్రశ్నలకు సమాధానం నా దగ్గర లేదు.. అతడ్ని ఎందుకు రమ్మందో నాకు తెలిస్తే కదా... తనకు చెప్పడానికి ?

" ఒరేయ్ ప్రకాశం ... పదేళ్లుగా లేని ఆపేక్ష, ప్రేమా అమాంతంగా ఈనాడు పుట్టుకొచ్చి నట్లు ? ఇదొక నాటకం... నా సంసారంతో సుఖంగా వున్నాను.. తనను ఏనాడో మరచి పోయా నని, రానని చెప్పు.... తనకూ, నాకూ ఏ విధమైన సంబంధమూ లేదన్నానని కూడా చెప్పు......" అంటూ విసురుగా వెళ్లి పోయాడు.

అతడు ఏమన్నదీ అక్కయ్యకు చెప్పాను. 'రానన్నానని చెప్ప మన్నాడ్రా మీ బావ ? ' అంది శూన్యంలోకి దృష్టిని సారిస్తూ. ఈ మాత్రానికే [illegible] తను తల పెట్టిన కార్యాన్ని [illegible] లోనే విడిచి పెట్టదని తెలుసు !

* * *

మరునాడు సాయంత్రం ఆఫీసు నుండి రాగా కృష్ణమూర్తి బావ ఇంటికి ప్రయాణ మయింది. ఇల్లు చేరుకునే సరికి తొమ్మిది గంటలు దాటింది. చాలా ఉత్సాహంగా కన్పించింది.

"బాబాయి నీ మేనల్లుడి ఇల్లు చూస్తేనే ముచ్చటేసిందనుకో, పిల్లలతో కళకళ్లాడుతోంది. ఆఖరివాడు ముద్దొస్తూ ఉన్నాడు, అంతా వాళ్ళ నాన్న పోలిక చెల్లెలు కూడా నెమ్మదస్తురాలు, మర్యాదస్తురాలు భోజనం చేసి వెళ్ళమని బలవంత పెట్టింది 'ఇంక ఇక్కడ ఉండేదాన్నే చెల్లెలా, ఈ సారి వచ్చినప్పుడు చేస్తా'నని సమాధాన పరచి వచ్చాను ఆయన మాత్రం ఎవరో పరాయి వాళ్ళని చూసినట్లు చూశారు, హెడ్మాష్టరయ్యారటుగా ?" అంది నాన్నగారితో.

నాన్నగారు బదులు చెప్పలేదు భారమైన నిట్టూర్పు విడిచారు కొన్ని గంటల వ్యవధిలోనే బావ భార్యా పిల్లలను తననే వు (త్రిప్పుకున్నదేమో) నవ్వించింది.

[illegible]



## మీ కృషియే దేశానికి సౌభాగ్యం
## మీ పొదుపే రక్షణనిధికి మదుపు

### అందానికి సరసానికి

సహజమైన అసలు శిల్కు-తో సరిపోల్చడానికి ఇంకొకటి లేదు. అభిరుచిగల పురుషులు అందానికి సరసానికి బిన్నీవారి అసలు శిల్కు షర్టింగునే వాడతారు. అనుమతింపబడిన బిన్నీ స్టాకిస్టు లందరివద్ద విశిష్టమైన తయారీలు ప్రత్యేక శ్రేణులలో లభిస్తాయి.

## బిన్నీవారి అసలు శిల్కు షర్టింగు



ది బెంగళూరు ఉల్లెన్, కాటన్ & శిల్కు మిల్స్ కంపెనీ లిమిటెడ్, అగ్రహారం రోడ్డు, బెంగళూరు-23.
బిన్నీ & కంపెనీ లిమిటెడ్ మద్రాసువారి అంగ సంస్థ.

## 16-10-1964 శుక్రవారము మొదలు 22-10-1964 గురువారము వరకు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | | గు | రా |
| చం శ | వారఫలం | | కు |
| | మహేష్ | | శు |
| కే | | బు | ర |

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఆర్థిక వ్యవహారాల్లో కంటె ఆరోగ్య విషయంలో జాగ్రత్త చాలా అవసరం. వృత్తి వ్యాపారాల్లో జరుగవలసిన పనులు చురుకుగా నెరవేరడంవలన మానసికంగా సంతృప్తి లభించవచ్చును. కాని మీకంటె తక్కువ వారితో కార్యసాధనకోసం సన్నిహితంగా వ్యవహరించవలసి వస్తుంది. వృత్తిలో పోటీ పెరిగినా మీ కార్యక్రమాలకు ఆటంకం రాకపోవచ్చును. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మార్పులు ఏమీ రావు. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమమీద విజయాన్ని సాధిస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో చికాకులు రావడంవలన మానసికంగా అశాంతి కలుగుతుంది.

19, 20 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో భారీ ప్రయత్నాలకు పూనుకోవడంవలన అప్పుడప్పుడు ఆర్థికంగా ఒత్తిడి కలిగినా కొంత మంది మిత్రులు మీకు తోడ్పడగల సూచనలు ఉన్నాయి. సాహసంతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభించవచ్చును. వృత్తిలో కొంతకాలంగా నిలచిపోయిన వ్యవహారాల్లో కూడా మార్పులు రావడంవలన ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది కాని మీ అభివృద్ధిని సహించలేని వ్యక్తులు మీమీద నింద ప్రచారంచేసే ప్రమాదం ఉంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

21, 22 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈవారం అంత బాగా ఉంటుందని ఆశించడానికి అవకాశంలేదు. సామాన్యమైన వ్యవహారాలు నెరవేరడానికి కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసి రావడం వలన ముఖ్యమైన వ్యవహారాల్లో మీ శక్తిని కేంద్రీకరించడానికి వీలుపడదు. అధికారులవలన జరుగవలసిన పనులు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. రాబోయే సహాయాన్ని నమ్మి నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి సమయం కాదు. ఉద్యోగంలో చెప్పతగిన మార్పులు రావు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి ఫలించడానికి మార్గం ఏర్పడుతుంది.

స్త్రీలకు — ఆరోగ్యం గతవారంతో కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

21, 22 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి మంచివి.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

వృత్తి వ్యాపారాల్లో ఆకస్మికంగా కొన్ని మార్పులు వచ్చే సూచనలు ఉన్నాయి, కాని, వాటివల్ల మీకు కలిగే లాభనష్టాలు ఏమీ ఉండకపోవచ్చును. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో వెంటనే విశేషమైన ప్రోత్సాహం లేకపోయినా భవిష్యత్తులో రాణించుటకు అవసరమైన ఏర్పాట్లు జరుగుతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు. ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉండవు.

స్త్రీలకు— సంతానానికి కించిదనారోగ్యం చేయవచ్చును. సాంఘిక వ్యవహారాల్లో గౌరవం బాధ్యతా పెరుగుతాయి.

16, 17, 18 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈవారం మొత్తంమీద బాగా ఉన్నా వృత్తి వ్యాపారాల్లో అప్పుడప్పుడు అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడడంవలన నిరాశ వైరాగ్యం కలుగుతాయి. మీరు ఇదివరకు నిర్లక్ష్యంచేసిన వ్యవహారాలకు ఇప్పుడు ప్రాముఖ్యత వస్తుంది. వృత్తిలో శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగం బాగానే ఉంటుంది. మీ అభిప్రాయాలు అధికారుల ఆమోదాన్ని పొందుతాయి. అప్పుడప్పుడు ఆర్థికంగా కొంచెం ఇబ్బంది రావచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉన్నా మానసికాందోళన కలగవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. అధిక వ్యయం జరుగుతుంది.

19, 20 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

**సూచన**

**నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.**

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో ఇంతవరకు మీ అభివృద్ధికి ఆటంకంగా ఉన్న వ్యవహారాలు ఈవారంలో మీకు అనుకూలంగా పరిష్కారం కాగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఏదో ఒకవిధంగా సమయానికి డబ్బు అందడంవలన మీరు తలపెట్టిన వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. మీకు అంతగా సంబంధంలేని వ్యవహారాల్లో పరిస్థితుల ప్రాబల్యంవలన మీరు శ్రమ పొందవలసి వస్తుంది. ఉద్యోగం బాగానే ఉంటుంది. ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు సులువుగా నెరవేరతాయి. బంధువులతో కలహ ప్రసంగం రావచ్చును. పుణ్యకార్యాలు చేస్తారు.

19, 20 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

వృత్తి వ్యాపారాల్లో వ్యవహారాలు మీరు వూహించినట్లుగా జరగలేదని నిరాశ పొందినందువలన ప్రయోజనంలేదు. వారాంతానికి ఏదో ఒకవిధంగా మీ కార్యక్రమాలన్నీ పూర్తికావడంవలన ఆదాయం పెరగవచ్చును. వృత్తిలో మీరు ఇతరుల మొగమాటానికి లొంగిపోవడంవలన కొన్ని అవకాశాలను కోల్పోయే ప్రమాదం ఉంది. ఆర్థికమైన ఇబ్బందుల వలన ఇదివరకు ఆగిపోయిన వ్యవహారాలను తిరిప్రారంభిస్తారు. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయరాదు.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పాటివారిలో మీ గౌరవం పెరుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు.

19, 20 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### వృశ్చికం :

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తి వ్యాపారాల్లో మీరు చేయవలసిన ముఖ్యమైన నిర్ణయాలను ఇప్పుడే చేసివేయడం మంచిది. ఆలస్యం చేసినందువలన తరువాత పశ్చాత్తాపపడవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. వృత్తిలో కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని మోసంచేయడానికి ప్రయత్నం చేస్తారు. అన్ని వ్యవహారాల్లోను జాగ

# వారఫలం

త్తగా వ్యవహరించడం అవసరం. వృత్తిరీత్యా చేయవలసిన ప్రయాణాల్లో ప్రయోజనం కంటె ప్రయాస అధికంగా ఉంటుంది. ఉద్యోగంలో మీకు అనుకూలమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యము బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. బంధు సమావేశాల్లో పాల్గొంటారు.

21, 22 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

### ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈవారం గడచిన కొద్ది వారాలకంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు రాణించవచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి అనుకూలంగానే ఉంటుంది కాని విశేషమైన ప్రయోజనాన్ని ఆశించడానికి సమయంకాదు. కోర్టు వ్యవహారాల్లో మీకు ప్రాబల్యం కలిగిన మిత్రుల అండదండలు లభించడంవలన అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. కొంచెం అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. బంధువులకు సహాయం చేస్తారు.

21, 22 తేదీలు మిక్కిలి మంచివి. మిగిలినవి సామాన్యం.

### మకరం:

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈవారం ఇతరుల దృష్టిలో మీకు యోగవంతమైనదే కాని మీకు మాత్రం అంత సంతృప్తికరంగా ఉండదు. మీ అభిప్రాయాలకు ఆలోచనలకూ అందరూ ఓహో అంటారుగాని దానివల్ల మీకు ఒరిగేదేమీ ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. మీ స్వంతపనులు ఎలాగ ఉన్నా ఇతరుల వ్యవహారాల్లో మాత్రం విజయాన్ని సాధిస్తారు. వృత్తి ఉద్యోగాల్లో మార్పులు ఏమీ రావు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో పలుకుబడి పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు కార్యరూపం ధరించవచ్చును.

16, 17, 18 తేదీలు మంచివి. మిగిలినవి సామాన్యం.

### కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

వృత్తి వ్యాపారాల్లో కొంత శ్రమ కలిగినా తగిన ప్రతిఫలం కూడా ఉండడంవలన మొత్తంమీద పరిస్థితి సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో కన్పించే నూతనావకాశాలు విశేషంగా ఫలించకపోవచ్చును. వృత్తిలో మున్ముందు లాభించుటకు అవసరమైన మార్పులు ఏర్పాట్లు మీ ప్రయత్నం లేకుండానే జరుగుతాయి. ఉద్యోగంలో మీరు ఇదివరకు చేసిన కృషికి తగిన ఫలితాన్ని ఈవారం పొందగలరు. స్నేహితులకు సహాయం చేయడం వలన మీకే ఆర్థికంగా కొంచెం ఇబ్బంది రావచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సజ్జన సహవాసం లభిస్తుంది.

స్త్రీలకు—సాంఘిక కార్యక్రమాల్లో మార్పులు వస్తాయి. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని కార్యక్రమాలు నిలచిపోవచ్చును.

21, 22 తేదీలు సామాన్యం. మిగిలినవి మంచివి.

### మీనం:

(పూ. భాద్ర, 4 పా, ఉ. రేవతి.)

ఈవారం కూడా అంత బాగా ఉండకపోవచ్చును. ఇంతవరకు మీకు సన్నిహితంగా ఉన్నవారే కొంతమంది కాళ్లమీద పడి వేళ్లు కరిచే విధంగా ప్రవర్తించడంవలన ఏమి చేయవలెనో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో పోటీవారితో పోటీ పెరిగే సూచనలు ఉన్నాయి. భారీ యెత్తున చేసే వ్యాపారాలు కొంతకాలంపాటు వాయిదా వేయడం మంచిది. ఉద్యోగంలో మీ పరిస్థితి గతవారంలో కంటే బాగా ఉంటుంది. స్థిరాస్థి వ్యవహారాలు ఇంకా చక్కబడవు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. ప్రేమవ్యవహారాల్లో ఉన్న అభిప్రాయభేదాలు తొలగిపోతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం గతవారంలో కంటె బాగా ఉంటుంది. బంధువుల్లో గౌరవం లభిస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

16, 17, 18 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.



# జన్మదినఫలం

### అక్టోబరు-16

ఈ సంవత్సరం చిత్రంగా ఉంటుంది. మీరు ప్రయత్నముచేసిన పనులకు ఆటంకాలు రావడం, అసాధ్యం అనుకున్న కార్యాలు నెరవేరడంవంటి సంఘటనలు జరగవచ్చును. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి కాని దానివల్ల ఏ కార్యక్రమమూ ఆగిపోదు. సంవత్సరం ఆఖరులో వ్యాపారంలో ఆకస్మికంగా ధన లాభం కలగవచ్చును. వృత్తిలో మార్పులు రావు. ఉద్యోగం సంతృప్తికరంగా ఉంటుందికాని మార్పుకోసం ప్రయత్నం చేయడానికి సమయంకాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని సంవత్సరం మధ్యలో అనారోగ్యం చేయవచ్చును. బంధువులతో కలహప్రసంగం రావచ్చును. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

### అక్టోబరు-17

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. మీ జీవిత మార్గాన్నే మార్చివేయగల సంఘటనలు ఈ సంవత్సరం జరగటానికి అవకాశం ఉంది. సంవత్సరం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో మీరు ఎదురుచూడని అవకాశాలు లభిస్తాయి. మీకు రావలసిన డబ్బు సమయానికి అందడంవలన వ్యాపారంలో అన్ని కార్యక్రమాలూ చురుకుగా సాగి ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో క్రొత్త వారితో పరిచయం, తన్మూలంగా ప్రయోజనం లభిస్తాయి. ఉద్యోగంలో ఉన్నత స్థానంకోసం ప్రయత్నం చేయడానికి తగిన సమయం. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు బాగా ఉంటాయి.

### అక్టోబరు-18

ఈ సంవత్సరం ప్రయత్నించిన ప్రతిపనీ నెరవేరుతున్నట్టే కన్పిస్తుందిగాని ఫలితం పూర్తిగా చేతికి వచ్చేవరకూ నమ్మడానికి అవకాశంలేదు. మీకు రావలసిన డబ్బును నమ్మి ఏ వ్యవహారమూ ప్రారంభించడం మంచిదికాదు. వృత్తి వ్యాపారాల్లో ఆర్థికంగా నష్టం కలగదుగాని ఏదో ఒక విధంగా ఆందోళన కలుగుతుంది. వృత్తిలో సాటివారితో విరోధం రావచ్చును. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్పబడవచ్చును. మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో కూడా ఇప్పుడు చికాకులు రావచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండదు. ఎప్పుడూ ఏదో స్వల్ప అనారోగ్యం చేస్తుంది. కుటుంబ వ్యవహారాలు మాత్రం బాగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మొదట కొంత ఇబ్బంది కలిగినా తరువాత చాలా అనుకూలంగా ఉంటుంది. విద్యార్థులు మొదటినుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

### అక్టోబరు-19

ఇంతవరకు మీరు నమ్మినవారే కొంతమంది మిమ్మల్ని మోసం చేయడంవలన మీవారెవరో, పైవారెవరో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తి వ్యాపారాల్లో ప్రతి క్షణమూ ఏదో ఒక సందేహం కలుగుతూ ఉండడంవలన సాహసించి ఏ పనీ చేయలేరుగాని మీ సందేహాలు సరియైనవేనని తరువాత రుజువు కావడంవలన ఏ పనీ చేయకుండా ఉండడమే సంతృప్తికరంగా ఉంటుంది. భారీ ఎత్తునచేసే వ్యాపారాలు ప్రస్తుతం మంచివికావు. వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి అంత సంతృప్తికరంగా ఉండదు. ఇతరుల పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించవలసి వస్తుంది. ఆరోగ్యం బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సాంఘిక కార్యక్రమాల్లో వ్యయ ప్రయాసలు పెరుగుతాయి. విద్యార్థులు మొదటనుంచీ శ్రద్ధగా చదవడం మంచిది.

అమ్మా, నేను, నా బొమ్మల నన్నిటిని సరిగా పెట్టాను...



అల్లాగ! అయితే, ఆమెకు ఒక చాక్‌లెట్
ఇవ్వాలి—
పాల యొక్క గుణములు
గలిగిన క్యాడ్‌బరీస్ చాక్‌లెట్!




Cadbury's క్యాడ్‌బరీస్ చాక్‌లెట్
మిఠాయిని మించినది... ఆహారము!

## అక్టోబరు-20

# జన్మదినఫలం

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాల్లో ప్రయోని మీది, ప్రయోజనం మరొకరిది అయ్యే పరిస్థితి ఏర్పడవచ్చును. మీరు ఇంతవరకు శ్రమపడి ఒక దారికి తెచ్చిన వ్యవహారాల్లో కూడా మరల చిక్కులు రావడంవలన మీ వ్యవహారికలోను ఉత్సాహంగా కృషి చేయలేరు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు మాత్రం కొంచెం బాగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో మెప్పుకురాని శ్రమకు గురి కావలసి వస్తుంది. సాధ్యమైనంతవరకు అన్ని వ్యవహారాల్లోను నిగ్రహంగా నిర్వహించడం అవసరం. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. సంతానానికి అనారోగ్య సూచనలు ఉన్నాయి. బంధువుల వ్యవహారాల్లో శ్రమపడినా తిరస్కారం వస్తుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. విద్యార్థులకు పెద్దలిచ్చే పరీక్షలు బాగా ఉంటాయి.



## అక్టోబరు-21

అభ్యుదయము కొన్ని చికాకులు కల్గినా మొత్తము మీద ఈ సంవత్సరం చాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో స్వల్ప వ్యవహారాలకు కూడా వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. కాని, తగిన ప్రయోజనం లభించడం వలన మీకు శ్రమ అనిపించదు. వ్యాపారం ఖాతీ ఎక్కువ చేయడంవలన అప్పుడప్పుడు పెట్టుబడి చాలని ఇబ్బంది కన్పిస్తుంది. వృత్తిరీత్యా దూర ప్రయాణాలు చేస్తారు. ఉద్యోగంలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. స్థిరాస్తి వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావచ్చును. గృహనిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు కొన్ని ఆటంకాలు రావచ్చును. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## అక్టోబరు-22

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. సంవత్సరం మధ్యలో వృత్తి వ్యాపారాల్లో ఒకేసారి వచ్చే చికాకుల వలన మీరు అంతవరకు క్రమక్రమంగా సాధించిన అభివృద్ధి వ్యర్థమైపోయే ప్రమాదం ఉంది. మిగిలిన వ్యవహారాలు ఎలాగ ఉన్నా ఈ సంవత్సరం ఆర్థికంగా బాగా ఉండవచ్చును. ఎప్పుడూ ఏదో ఒక డబ్బు అందుతూ ఉండటంవలన మొత్తంమీద పరిస్థితి బాగానే కన్పిస్తుంది. ఉద్యోగంలో వ్యతిరేక వాతావరణం ఏర్పడే సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యథాతథంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో కొంత శ్రమమీద ప్రముఖస్థానాన్ని సంపాదిస్తారు. విద్యా వైజ్ఞానికరంగాల్లో మీ కృషి పరిగణింపబడుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులకు క్లాసు రావచ్చును. ★

# వానలో నవ్వులు!

కుంభవర్షం కురియనీయండి! మీకు చింతేల? మీ వద్ద నివియా వున్నది! నివియాలో "యుసిరైట్" అసమాన పదార్థంవున్నది. అది రోజూ స్నానమందు. మరియు ఎండ, గాలి, వానలకు లోనగుటవల్ల గోల్పోయిన మీ చర్మమందలి సహజ చమురులను మరల పూరించుతుంది. మీ చర్మానికి కావలసిందల్లా నివియా. మీ చర్మమంతటికీ అది కావాలి.






## నివియా వివిధోపయుక్తమైన క్రీము

మీ చర్మమును మృదువుగాను, యౌవన పూరితమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది.






జె.ఎల్. మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్., పోస్టు బాక్సు నం. 1748, బొంబాయి-1.

Aiyars C. 249 Tl.




## జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాధను చెపుతూవుంటుంది... 'జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకి రామారావులకు పెళ్ళవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు. భార్యాభర్తల మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు రావటంతో, జానకి తానాశించిన ఆనందాన్ని పొందలేకపోతుంది. జానకిపై రామారావు అనుమానం నానాటికి పెరిగిపోతూ వుంటుంది. పండుగకు జానకి దగ్గరకెళ్ళిన సీత, ఆ సంసారాన్నంతా బాగా అర్థం చేసికొనగలుగుతుంది. సినిమా హాలులో రామారావు, విద్యార్థిని రమతో మాట్లాడటం సీతలో అనుమానానికి దారితీస్తుంది. ఆ సంగతి ప్రస్తావించిన జానకికి రామారావు చేతిలో మళ్ళీ చీవాట్లు తగిలాయి. ముమ్ముందు రామారావు రమను తన యింటికే తీసుకొస్తున్నాడన్న వార్త జానకి పుట్టింట్లో సంచలనాన్ని కలిగిస్తుంది. సందర్భవశాత్తు ఒకనాడు ఆ రమాదేవి ఇంటికే సీత వెళుతుంది. సీత ప్రయత్నం ఫలించి, జానికి కాపురం కుదుటబడుతుంది. రామారావు జానకిని ఆప్యాయంగా చూసుకొంటూంటాడు.

## 10

అమ్మకూ, నాన్నకూ ఉత్తరం చదివి వినిపించాను. పరిస్థితుల ప్రభావానికి అమ్మ విచార పడ్డది. ఒక విచారం మనస్సులో నుంచి తొలగిపోతే ఇంకో రకమైన విచారంతో బాధ పడవలసిందే కాన్పుగాలేం మాట్లాడలేదు. ఈ సమస్య వాళే వదిలారు. అమ్మ మాత్రం ఏమయినా సరే మొదటి కాన్పు కనక పురిటికి ఇక్కడికే తీసుకు రావాలని పట్టు బట్టింది. అమ్మకు ఎంత నచ్చచెప్పినా వినలేదు. ఆఖరికి నేను అంతా విడమర్చి చెప్పాను. "కుదుట పడ్డ కాపురాన్ని ఈ కాన్పుతో కూలదొయ్యవద్దని ఏవీ లేకపోతేనే, అక్కయ్య అక్కడుండంగానే అనేక అభాండాలు వేస్తున్నారు. ఇంక అక్కయ్య పురిటికి ఇక్కడికి వచ్చేస్తే పరిస్థితులు వికారంగానే విషమించవచ్చు. మనస్సులో కోరికలు లేకపోయినా, ఏ మాలిన్య భావాలూ లేక పోయినా అన్యోన్యత కలతం పొడవటానికి ఒక్క విషబిందువు చాలు. జీవితాంతమూ నిగ్రహంతో ఉన్నా మనోవికారం ఒక్క క్షణంలో జీవితాన్ని నాశనం చేస్తుంది. కన్ను పోయేటంత కాటుక పెట్టుకోవటం ఎందుకు ?" అన్నాను అమ్మతో.

నా మాటలు అమ్మ మనస్సులో జొరబడి బాగానే పని చేసినయ్యి. ఏడవ నెలలో పసుపు కుంకుమ ఇచ్చి వేడుక చేసి తొమ్మిదో మాసం రాగానే అమ్మ గుంటూరు వెళ్ళటానికి ఒప్పుకుంది.

ఈ విషయం అక్కయ్యకు ఉత్తరం రాశాను. అక్కయ్య, బావాకూడా ఈ పద్ధతికి ఒప్పుకున్నారు.

ఏడో మాసం రాగానే అమ్మా, నేను అక్కయ్యకు సూడిద లివ్వటానికి గుంటూరు వెళ్ళాము. అక్కయ్య విప్పారిన ముఖంతో మాతో మాట్లాడింది. తన సంసారంలో ఏ కొరతా లేదనే అక్కయ్య చెప్పింది.

అక్కయ్యకు వేడుకలు చెయ్యటానికి అన్ని ప్రయత్నాలు చేసింది అమ్మ. వందరూపాయలు పెట్టి చీరా జాకెట్టు గుడ్డా కొన్నాము. వినుకొండ ఉత్తరం రాయంగానే అక్కయ్య అత్తగారూ, సుభద్రా వచ్చారు. సుభద్రను చూడంగానే వెనకటి విషయాలన్నీ గుర్తొచ్చి నాకు చచ్చే నవ్వొచ్చింది. రెండు మూడు రోజుల్లోనే సుభద్ర చాలా మారిపోయినట్లు గ్రహించాను. ఇప్పుడు సుభద్రకు వయస్సుకు తగిన తెలివితేటలున్నయ్యి. అక్కయ్య, బావ విషయం, రమాదేవి సంగతి వినుకొండలో వాళ్ళకీ తెల్సిందట. ఈ విషయాలన్నీ విని తల్లి ఎంతో బాధ పడిందిట. కాని కొడుక్కి చెప్పే స్తోమత లేక, చెప్పినా బావ వింటాడనే నమ్మకం లేకా బావ తల్లిదండ్రు లిద్దరూ తమ కొడుకు సంగతి తెల్సినా ఏమీ పట్టించుకోలేదు. సుభద్ర అన్ని విషయాలూ అడిగింది. నాకు తెల్సిన సంగతులన్నీ చెప్పాను. అన్ని సంగతులూ విని సుభద్ర చాలా చిన్న బుచ్చుకున్నది.

అక్కయ్య పేరంటానికి రమాదేవిని పిలవాలా, వద్దా అన్న సమస్య వచ్చింది. అక్కయ్య నడిగితే పిలవమన్నది. అన్ని ఇళ్ళకూ వస్తాను గాని రమాదేవిని పిలవటానికి మాత్రం రానన్నది సుభద్ర. సుభద్ర పట్టుదలకు నాకు సంతోషమైంది. వయస్సు పరిమితమైన జ్ఞానాన్ని ఇవ్వటమే గాక ఆడపిల్లలకు అభిమానాన్ని కూడా ఎక్కువ మోతాదులోనే ఇస్తుంది. వయస్సొచ్చిన ఆడపిల్లల మనస్సు అతి సున్నితమైనది. ముందాలోచనలూ, ఆత్మాభిమానమూ, అణకువ, వయస్సు పెరిగిన కొద్దీ ఎక్కువవుతయ్యి. సుభద్ర ఇంతగా పరిపూర్ణ జ్ఞానాన్ని సంపాదించుకుంటుందని నేను వూహించలేక పోయాను. తన అన్నగారి విషయాలన్నీ విని విచార పడ్డది.

అన్ని ఇళ్ళూ పిలిచాక నేనే వెళ్ళి రమాదేవిని పిలిచాను.

"నన్ను పేరంటానికి రమ్మన్నావా సీతా. మనస్సులో లేని భావాలు, పది మంది దృష్టి మన మీద పడంగానే మనస్సు ఎంత బాధ పడుతుంది. వట్టిగా రావటం వేరు. పేరంటానికి రావటం వేరు. పది మందీ పది రకాలుగా ముఖానే అడుగుతారు. ఆ అడిగే వారు ఎన్ని కాని పన్లు చేస్తున్నా భర్త చాటు భార్య లవటం చేత అవి బయటికి రావు. వాళ్ళు సంఘంలో గౌరవనీయులు. నాబోటిది అందరి ఎదటా పడితే వాళ్ళల్లో వాళ్ళే బుగ్గలు నొక్కుకుంటారు. కాల పరిస్థితులే అట్లా ఉన్నయ్యి. నేను రాను సీతా. ఏమీ అనుకోకండి. అక్కయ్యతో చెప్పు ఏమీ అనుకోవద్దని. ఆ వేడుక చూట్టానికి నేను నోచుకోలేదు. నే వచ్చినా నన్ను వాళ్ళేమయినా అన్నా నాకు బాధ లేదు. నా నుంచి మీరు బయట పడతారు. నేను ఎప్పుడూ వచ్చే దాన్నే. మీ అక్కయ్య పది కాలాలపాటు సుఖ సంతోషాలతో కాపురం చెయ్యటమే నా కోరిక. కాని అంతా అట్లా అనుకోరుగా సీతా" అన్నది. రమాదేవి చెప్పిన అభిప్రాయాలు నాకూ నిజమనే అనిపించింది. కాసేపు మాట్లాడి వచ్చేశాను.

వేడుకలు పూర్తయినయ్యి. అంతా వాళ్ళల్లో వాళ్ళు ఏవో గొణుక్కున్నారు. ఒకావిడ మాత్రం ఉండబట్టలేక అమ్మని అడిగింది. నాకు అరికాలి మంట నెత్తికెక్కింది. చెప్పవలసిన సమాధానం చెప్పేసరికి ఆవిడ కిక్కురు మనకుండా వెళ్ళిపోయింది.

నాలుగు రోజులుండి అక్కయ్య అత్తగారూ, సుభద్రా వెళ్ళిపోయారు. సుభద్ర నన్ను వినుకొండ రమ్మన్నది. వీలునిబట్టి వస్తానన్నాను.

తొమ్మిదో మాసం రాగానే వస్తానని చెప్పి అమ్మ వెళ్ళింది. నన్ను వదిలి వెళ్ళటానికి ఇష్టం లేక పోయినా అక్కయ్య మరీ మరీ చెప్పి బ్రతిమాలటం నుంచి అమ్మ ఇష్ట పడ్డది.

అమ్మ అక్కయ్యతో అన్నదిట. పురుడు వెళ్ళంగానే ఎక్కడో క్కడ సంబంధంచూసి నన్ను కూడా ఒక అయ్య చేతిలో పెట్టి తమ బాధ్యత వదిలించుకుంటుందిట. నాకూ నవ్వొచ్చింది అమ్మ ఆదుర్దాకి.

"నువ్వేమన్నావే" అన్నాను అక్కయ్యతో.

"తొందరగా దానికీ పెళ్ళి చెయ్యండి. దాని కాపురం నేనూ చూడాలని ఉంది అన్నాను" అన్నది అక్కయ్య.

"అవును. నీ కాపురం ఈ తీరుగా ఉందా. నీకు తోడు నేనూ ఏడుస్తూ ఉండొచ్చు. మనిద్దర్నీ చూసి అమ్మ ముక్తిమార్గం తొందరగా చూసుకుంటుంది" అన్నాను.

"అందరికీ నామాదిరి అదృష్టమే పడుతుందంటావా. మా మరిదిగారు నిన్ను చక్కగా, అపేక్షగా చూసుకోవచ్చు. కాకపోయినా నామాదిరి తెలివి తక్కువ దానివి కాదుగా. నెలరోజుల్లో ఆయన్ని మార్చేస్తావ్. నువ్వు సామాన్యురాలివా." అన్నది అక్కయ్య నవ్వి.

"నాకసలు పెళ్ళేవద్దు. వచ్చేఏడు కాలేజీలో చేరి మళ్ళీ చదువు ప్రారంభిస్తాను. చదువుకుని ఉద్యోగం చేసుకుంటూ కాలం గడుపుతాను." అన్నాను.

"అవున్లే అప్పుడే ఎవర్నయినా ప్రేమించి పెళ్ళి చేసుకోవచ్చు. ఈ రోజుల్లో అదేం తప్పు కాదుగా" అన్నది.

"ఏ రోజుల్లో అయినా తప్పులేదు. మన సాంప్రదాయాలకూ, కులగోత్రాలకూ విరుద్ధంగా ఉండకుండా ఉంటేసరి. ప్రేమించి పెళ్ళి చేసుకున్నా తప్పులేదు. ఆ ప్రేమ వెర్రి తలలు వెయ్యకుండా ఉంటే సరి. ఒకరి నొకరు అర్థం చేసుకుని సత్సాంప్రదాయాలకు గౌరవాన్నిచ్చి ప్రేమించి పెళ్ళి చేసుకోటం చాలా మంచి పద్ధతే" అన్నాను.

"అంటే నా పెళ్ళి అట్లా జరగలేదు కాబట్టే ఇట్లా ఉంది నా కాపురం అంటావా" అన్నది.

"నా అభిప్రాయం అది కాదు. అసలు ప్రేమకు తొలిఘట్టం వాంఛ కాకూడదు. వాంఛతో ప్రేమిస్తే అది ఆత్మార్పణ చేసుకున్నట్లు కాదు. తళుకు బెళుకులకు దాసులై, సౌందర్యానికి ముగ్ధులై అంగ విన్యాసాలకు లొంగి పోయి ప్రేమించామని చెప్పుకునే వాళ్ళు ఈ రోజుల్లో ఎంతో మంది ఉన్నారు. ప్రేమకు మూలం మనస్సు. మనస్సుతో ప్రేమించిన ప్రేమే సార్థకత చెందుతుంది." ఇంకా ఏమిటో చెప్పాలనుకున్నాను. అక్కయ్య నవ్వుతూ నన్ను చూస్తుంటే నాకు సిగ్గేసింది.

"అంటే అందచందాలు చూసి ప్రేమించ కూడదంటావా. ఆడదానికి అంద చందాలు లేక పోతే నిన్ను ప్రేమిస్తున్నానని ఏ పెళ్ళి కావలసిన మగవాడూ అనడు. అందమే ప్రేమ కలగటానికి దారి తీస్తుందేమో" అన్నది అక్కయ్య. నా మనస్సులోని భావాలను అక్కయ్యకు కాక మరెవ్వరికీ చెప్పుకుంటాను.

"అసలు ప్రేమని ఏ దృష్టితో చూడాలంటావు. శారీరకమైన సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని చూడాలా ? అందాన్ని దృష్టిలో పెట్టుకు చూడాలా మనస్సుని దృష్టిలో పెట్టుకు చూడాలా ?" అన్నది అక్కయ్య. చాలా పెద్ద ప్రశ్న వేసింది అక్కయ్య అనుకున్నాను.

"మంచితనాన్ని బట్టి ప్రేమించాలి. ఒక వ్యక్తిని మనం చూడంగానే వెంటనే వాళ్ళ మీద మనకు ఏ విధమైన అభిప్రాయం కలగదు. అభిప్రాయమనేది ఏదో ఒక దృష్టిలో, ఒక కోణంలో చూస్తేనే గాని కలగదు. ప్రేమించటానికి ముందు ఆ వ్యక్తి యందు మనకు ఒక విధమైన సదభిప్రాయం కలగాలి. అలాంటి సదభిప్రాయంలో నుంచే ప్రేమ కలుగుతుంది. ఒక వ్యక్తిని చూడగానే వారి ఉనికిని బట్టి వారితో పరిచయం లేకపోయినా, వారి గుణగణాల్ని మనం అంచనా వేసుకుని, సంస్కారాన్ని, కుటుంబాన్ని దృష్టిలో ఉంచుకుని, ఈ అంచనాలను మిళితం చేసుకున్నాక మన జీవితమంతా వారి జీవితంలో కలిసి పోవాలని కలిగే ఒక రకమైన మానసిక భావమే ప్రేమ. అలాంటి మెత్తని భావమే, సరళమైన స్వభావమే ప్రేమ. ఈ సద్భావంలో నుంచి కలిగిన ఒక రకమైన ఉద్వేగమే ప్రేమ." అన్నాను.

"చాలా కావ్యాల్లోనూ, పుస్తకాల్లోనూ తొలి చూపులోనే ప్రేమించేసుకున్నారంటారుగా. అలాంటి తొలిచూపులో నువ్వు చెప్పిన అంచనాలన్నీ వేసుకోవటం కష్టమే." అన్నది అక్కయ్య.

"అవును. అది వాంఛా దృష్టితో చూసిన ప్రేమ. వాంఛతో కూడిన ప్రేమ శరీర సుఖాన్నే కోర్తుంది. మనస్సునీ, హృదయాన్నీ అర్థం చేసుకుని ప్రేమించాలంటే కొంత కాలం పట్టొచ్చు. దానికీ ప్రథమ చూపులోనే వాళ్ళు ప్రేమించుకున్నారని అనుకోటం కద్దు. ఉదాహరణకి ఫలాని అమ్మాయి ముఖం పున్నమ చంద్రుడిలా ఉన్నదంటారు. అంటే అమ్మాయి ముఖం గుండ్రంగా వంకర లేకుండా ముక్కుని సెంటరుగా తీసుకుని ఒక సర్కిలు కొట్టినట్లుగా ఉంటుందా. ఎన్నటికీ ఉండరు. అదంతా గ్రాంథిక భాష. పుస్తకాల్లో ఉండేది. ఆ భావాలు అంతవరకే. చదివి ఆనందించటం వరకే. మనస్సుని ఆకట్టుకుని ఏర్పర్చుకున్నదే ప్రేమ. ఆ స్థితికి వచ్చి ప్రేమించాలంటే కొంత పరిచయమూ, అభిప్రాయాలూ ఉండాలి. ఏదీ లేకుండా నేను ఫలానా అమ్మాయిని ప్రేమించాననో, ఫలాని అబ్బాయిని ప్రేమించాననో అంటే అది నమ్మ తగిన ప్రేమకాదు. వాంఛాపూరితమైన ప్రేమ. అందుకనే పూర్వకాలంలో చిన్నప్పుడే పెళ్ళి చేసేవాళ్ళు. పదేళ్ళ పిల్లకి పెళ్ళి చేస్తే ఆ పిల్లకి ప్రేమించటమంటే ఏం తెలుస్తుంది. తెలీదు. పెళ్ళయ్యాక ఏడాదిలోపల తీసుకొస్తారు

## హృదయ కుసుమాలు

అలుడ్ని- పండగలకు తీసుకొస్తారు. ఈ పిల్లనూ అత్తవారు పండగలకి వాళ్ళింటికి తీసుకెళ్లొచ్చు. ఇలాంటి రాకపోకలవల్లా, అల్లుడిమీద తన తల్లి దం(డులు చూపే సద్భావమూ, గౌరవ మర్యాదల మీద ఈ పెళ్ళయిన పిల్లదృష్టి పడుతుంది. అలాంటి దృష్టి కలిగిన ఆ పిల్ల మనస్సులో ఆ వ్యక్తి నా భర్త, నా జీవితం వారితోనే గడపాలి, వార్నినేను గౌరవించాలి, వారు నన్ను మంచిగా చూసుకోవాలి, అనే భావాలతో కూడిన ఒకరకమైన సద్భావం ఈ పిల్ల దృష్టిలో, మనస్సులో హృదయంలో కలుగుతుంది. అదే ఆ భర్తయంద, ఆ పిల్లకు కలిగే [పేమ. గౌరవంతో కూడిన మెత్తని మనస్సు. సద్భావంతో కూడిన ఆలోచనల మొలకలే ఆ పిల్ల మనస్సులో మెదిలే సిగ్గు. అలాంటి సిగ్గు ఏర్పడింతరువాత వయస్సొచ్చిన కొద్దీ ఆ పిల్లలో కలిగే మానసిక పరిణామమే, భావో(దేకాలే [పేమ. అదే నిజమైన, హృదయాను గతమైన [పేమ.'' అన్నాను.

ఏమిటో నా కట్లా చెప్ప బుద్ధిపుట్టింది. చెప్పేశాను. అక్కయ్య ఏమనుకుందో ఏమో! ఇంతలోకి బావ రావటం నుంచీ, ఎవరో పిలుస్తుంటం నుంచీ ఆ [ప్రస్తావన ఆపేశాం.

* * *

''ఆ రోజున రమాదేవి పుట్టిన రోజు. కాలేజీలో తన స్నేహితురాళ్ళందర్నీ విందుకు పిల్చింది. నన్ను కూడా రమ్మని రెండు మూడు రోజులుగా బలవంతం చేసింది. నాకు వెళ్ళాలనిపించలేదు. అక్కయ్య తప్పక వెళ్ళమన్నది. అక్కయ్యను చూస్తే ఇప్పుడు జాలేస్తున్నది. మరీ బొత్తిగా లేవలేక పోతున్నది. నెలలు వస్తున్న కొద్దీ దడ, ఆయాసం, నీరసం ఆ రోజు కారోజు ఎక్కువవుతున్నది. బావ కులాసాగా కబుర్లు చెపుతూ అక్కయ్య ఆరోగ్యం విషయమై బాధ పడుతూ ఈ పురుడు ఎట్లా వెడుతుందా అని అక్కయ్య కన్న తనూ ఎక్కువ బాధ పడుతూ, ఆందోళన పడుతూ ఉండే వారు. ని(దలేవంగానే బావ నిత్యావసరాలన్నీ తనే స్వయంగా తీర్చాలని [ప్రయత్నించేది. ముఖం కడుక్కోటానికి నీళ్లు తనే ఇవ్వాలనుకునేది. స్నానానికి నీళ్లు తనే తోడాలనుకునేది. బీరువాలోంచి బట్టలు తనే ఇవ్వాలనుకునేది. భోజనం తనే దగ్గర కూర్చుని వడ్డించేది. కడుపుతో ఉండనప్పుడు మొదటి రోజుల్లో అంత కాల్చుకుతిన్న బావ ఇప్పుడు అక్కయ్యను ఎంతో ఆపేక్షగా చూసుకుంటుంటే ఆయన అవసరాలను ఇప్పుడు తను తీర్చలేక పోతున్నాను కదాని మనస్సులో బాధ పడేది. ''బొత్తిగా [స్రాణ లేక పోతే నువ్వు మటుకు ఏం చేస్తావు జానకీ'' అనే వారు బావ. తనూ తల్లి కాబోతున్నందుకు సంతోషపడ్డా ఎందుకనో అక్కయ్య మనస్సులో పిరికితనం [ప్రవేశించింది. మాట్లాడితే 'నేను [బతికి బయట పడతానా సీతా' అనేది.

అక్కయ్య ఈ పరిస్థితుల్లో ఉన్నా, అక్కయ్య [ప్రోద్బలం నుంచే నేను రమాదేవి పుట్టిం రోజు విందుకు వెళ్ళాను.

[illegible] గార్డెన్‌లో సాయం[illegible]
త్రం ఆరు గంటలకి విందు ఏర్పాటు చేసింది. రమాదేవి స్నేహితురాళ్ళంతా వచ్చారు. మొత్తం పాతిక మందికి పైగానే ఉన్నారు. నన్ను చూసి ఎంతో సంతోషంతో ఆహ్వానించింది. రమాదేవి తల్లి కూడా ఒక పక్కన కుర్చీలో కూర్చున్నారు. నన్ను వాళ్ళమ్మకు పరిచయం చేసింది. ఆవిడ ఎంత సంతోషంగా మాట్లాడినా ఆమె ముఖంలో విషాద రేఖలు బాగా కనుపించినయ్యి. బహుశా పెద్ద కూతురు శకుంతల ఆ విధంగా చనిపోయినందుకేనేమో ? రమాదేవి వదినగారితో పరిచయం చేసింది. ఆవిడ కనుబొమలతో, కళ్ళతో ఏమిటో లెక్క లేనట్లుగా మందహాసం చేసింది. నొక్కులుగా తల దువ్వుకుని జడ బిగుతుగా మెలిపెట్టి రింగులో నుంచి పాము పడగలాగా వెడల్పుగా తీసి, కొసలు వదులుగా వేలాడేటట్లుగా తీసి కొసలు నాగకన్యలా కేశాలంకరణ చేసుకుంది. పెదవులకి లిప్‌స్టిక్, బుగ్గలకు లేతరంగులో క్రీం రాచుకుంది. ఆ చీర కట్టూ, దేవతా వస్త్రాల్లాంటి ఆ చీర, చోళీలను చూస్తే ఈవిడ సంసార స్త్రీనా లేక సినిమాల్లో మాదిరి దేవకన్యా అని అనిపించింది. చేతులో "అమెరికన్ వేనిటీ బ్యాగ్" ఉన్నది. ఆవిడను చూస్తుంటే సానుభూతితో కూడిన నవ్వు వచ్చింది. ఈవిడ పిల్లలిద్దరూ ఎంత నిర్భాగ్యులో అనుకున్నాను. వాళ్ళకి కన్నతల్లి పోషణ లేదు. కన్నతల్లి ఆదరణ లేదు. కన్నతల్లి పెంపకంలేదు. వాళ్ళ ముద్దు ముచ్చటలు చూసి ఆనందించే అవకాశం ఆ తల్లికీ లేదు. ఆవిడ ఫేషన్ పెరేడ్‌లో ఉండ దగిన స్త్రీ. రమాదేవి చెప్పినట్లుగా ఆవిడ ఎప్పుడూ బిజీగా, హాలీవుడ్ నుంచి అప్పుడే వచ్చినట్లే ఉంటుంది. ఆవిడ అలంకరణలో ముఖ్యంగా గమనించి ముక్కుమీద వేలు వేసుకో వలసింది ఆవిడకు బొట్టు లేక పోవటమే. బొట్టు ఫ్యాషన్ కాదుట. బొట్టు పెట్టుకుంటే ఆవిడకు ఏమిటోగా ఉంటుందిట. రమాదేవి చెప్పిన వన్నీ యదార్థ విషయాలే. అంతా ఆవిడను చూస్తూ కూర్చున్నారు.

విందు ప్రారంభమైంది. రమా దేవికి అంతా శుభాకాంక్షలు అందచేశారు. రమాదేవిని ప్రశంశిస్తూ ఆవిడ చాలా సరళ స్వభావురాలనీ, స్నేహ పాత్రురాలనీ, ఆమె హృదయం నవనీతమని, బీద విద్యార్థినులకు చాలా మంది సాయం చేస్తూ ఉంటుందనీ, అందరితో కలిసి మెలిసి ఉంటుందనీ కొంతమంది విద్యార్థినులు మాట్లాడారు. రమాదేవి అందరికీ ఉచిత రీతిన సమాధానం చెప్పింది. అందరూ వెళ్ళి పోయాక రమాదేవి, రమాదేవి వదిన కృష్ణవేణి, నేనూ మాట్లాడుతూ కూర్చున్నాం. కృష్ణవేణి మాటల తీరు చూస్తుంటే ఆంధ్రదేశంలో యిలాంటి ఆడ వాళ్ళు కూడా ఉన్నారా అనిపించింది.

"మీ అక్కయ్యను గురించి నేను విన్నానండీ. తప్పు మీ బావ గారిది కాదు. ఆవిడదే తప్పు. తప్పు. పురుషులతో బాటు స్త్రీలకు కూడా సమాన హక్కులు ఇస్తున్నా ఈ రోజుల్లో, అందులోనూ చదువుకుని ఇంత లోక జ్ఞానాన్ని సంపాదించుకుని కూడా మీ అక్కయ్య ఎంతసేపూ, మీ బావగారి అడుగులకు మడుగులొత్తుతూ

[illegible]
మీ బావ అన్నారంటే ఎందుకు అనరు చెప్పండి. మానవత్వాన్ని చంపుకుని, మగవాళ్ళ ఆదేశాలే వాళ్ళ భావాలే, వాళ్ళ మాట ప్రకారం నడుచుకోవటమే ధ్యేయంగా పెట్టుకుంటే, భార్య వ్యక్తిత్వాన్ని భర్త తప్పక అణచి పెడతారు. వారికి కావలసింది ఏ వేళకు అది అందిస్తూ, వారి అవసరాలు తీరుస్తూ, వారి ఆదేశాలు శిరసావహిస్తూ ఉంటేనే పతివ్రతా లక్షణమా చెప్పండి. మేమంతా భర్తలతో కాపురాలు చెయ్యటం లేదా ? పిల్లల్ని కనటం లేదా. భర్తని వదిలేసి స్వేచ్ఛగా సిగ్గు విడిచి తిరుగుతున్నామా ? ఎక్కడికీ వెళ్ళకుండా, ఎవరి ప్రమేయమూ పెట్టుకోకుండా, పొద్దస్తమానం చాకిరీ చేసుకుంటూ సాయంత్రమయ్యే సరికి స్నానం చేసి, ఇంత పౌడరూ, స్నో ముఖానికి పట్టించి తెల్ల చీర కట్టుకుని, ఇన్ని పూలు తల్లో పెట్టుకుని, ఇంత కుంకం, ముఖాన పెట్టుకుని, వీధి గుమ్మంలో నిల్చుని భర్త రాక కోసం ఎదురు చూట్టంలోనే ఆవిడ తన కాలం గడపాలనుకోకూడదు. అట్లా ఉంటమే సంసార స్త్రీ లక్షణమూ కాదు. తమ అభిప్రాయాలకు తిలోదకాలిచ్చి, తమ కోరికలనూ, ఆదర్శాలనూ భర్తల హృదయాల్లో జార విడిచి, ఏ విధంగానైనా వారిని సంతోష పెట్టటమే స్త్రీ లక్షణం కాదు. బైటకి రావాలి. పదిమందితో సహృదయతతో స్నేహం చెయ్యాలి. పదిమంది అభిప్రాయాలు తెల్సుకోవాలి. పదిమంది జీవితాలు చూసి అర్థం చేసుకోవాలి. పదిమందిలో బింకూ

[illegible] గారికా లేక తమ అభిప్రాయాలను నిష్కర్షగా చెప్పగల ధైర్య సాహసాలు అలవర్చుకోవాలి. తోటి సంసార స్త్రీల అభిప్రాయాలూ, ఆదర్శాలూ తెల్సుకోవాలి. సాంఘికంగా తామూ విశాల హృదయులైన వ్యక్తిత్వం కలవారుగా ఉండాలి. అప్పుడే వారి జీవితాలు రాణిస్తాయి. వారూ ఒక వ్యక్తిగా వ్యక్తిత్వం గల స్త్రీగా, ఆదర్శ గృహిణిగా చలామణీ అవుతారు. అవునంటారా" అన్నది ఆవిడ.

ఆవిడట్లా గల గల మంటూ తడుముకోకుండా మాట్లాడుతుంటే నాకు దాహం వేసినట్లయింది. ఆవిడ ఆరితేరిన ఘటం. మాటకు మాట చెప్పగల నేర్పరి. వందమందిలో తిరిగి వెయ్యిమంది అభిప్రాయాలు తెల్సుకున్న వ్యక్తి. ఆవిడకు నేను సమాధానం చెప్పినా లాభం లేదనిపించింది. రమాదేవి ముభావకంగా కూర్చుంది నా వైపు చూస్తూ.

"మీరు చెప్పిన విషయాలు వినటానికి ఎంతో సొంపుగా ఉన్నాయండీ. వ్యక్తిత్వమనేది మానవ స్వభావం మీద, పుష్కలంగా డబ్బుంటం వల్లా ఆ కుటుంబంలో తమకు గల స్వేచ్ఛా వాతావరణం వల్లా ఏర్పడే ఒక రకమైన రూప కల్పన. అలాంటి రూపకల్పన ఆ వ్యక్తులు తమ తమ జీవితాలకీ, తమ వారి జీవితాలకీ జత చేసి అన్వయించుకోటంలో ఉంటుంది. మీరున్నారు. పదిమంది స్నేహితులతో ఏ మహిళా మండలిలోనో, క్లబ్బులోనో మాట్లాడుతూ ఎంత సేపయినా కాలం గడప గలరు. ఇంటి వద్ద వంట చేసుకోవాలనే ఇబ్బంది మీకు లేదు. పిల్లల పోషణ భారం మీరు

43 వ పేజీ చూడండి




"జబ్బేం లేదంటున్నారు, మరి పదిరోజులు అన్నం మానేయమంటున్నారే!" "నా ఫీజు త్వరగా చెల్లించడానికి లేవయ్యా."



మహిళల బహుముఖ ప్రగతికి కృషిచేస్తున్న ఆంధ్రమహిళాసభ తరగతి దృశ్యం

# రాష్ట్రరాజధానిలో మహిళాభ్యుదయం
# 80 వేలమంది బాలికల విద్యాభ్యాసం!

బాసాని సుదర్శనరెడ్డి

"సామాజిక వ్యవస్థలో స్త్రీకిగల ప్రతిపత్తి, స్థానమూ ఆజాతి ఔన్నత్యాన్ని వ్యక్తపరుస్తుంది." అని మన జాతినేత, జగన్నేత స్వర్గీయ జవహరు పండితుడు పలుమార్లు అభిభాషించారు. స్వాతంత్ర్యానంతరం దేశంలో స్త్రీవిద్యకు అగ్ర ప్రాధాన్యం ఇవ్వడమేకాక, అన్ని రంగాల్లోనూ భారతీయ స్త్రీ సమున్నత స్థాయిని సముపార్జించుకునేందుకు ప్రభుత్వమూ, ప్రభుత్వేతర సంస్థలూ అహర్నిశలు దీక్షా దక్షతలతో పరిశ్రమించడం ద్వారా మహోజ్జ్వల భవితవ్యానికీ, సుసంపన్నమైన నవసమాజ సంస్థాపనకు నాందీ ప్రస్తావన జరగడమేకాదు; అపూర్వమైన విజయాలూ సాధించడం జరిగింది.

పాఠశాలల్లో, కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో పురుషులతో పాటు లభ్యమయ్యే విద్యా సదుపాయాలే కాక, స్త్రీలకు, వారి ప్రత్యేక సమస్యల దృష్ట్యా, వివిధ విద్యా సౌకర్యాలు సమకూర్చబడుతున్నవి. ప్రత్యేక సౌకర్యాలను కలిగించడంలో ప్రభుత్వానికి సలహాలివ్వడానికి గాను, వివిధ రంగాల్లో మహోత్కృష్టమైన కృషి కావించి సమాజంలో సముచిత స్థానాన్ని అధిష్ఠించిన విదుషీమణులతో కూడుకున్న స్త్రీ విద్యాభివృద్ధి మండలులు, కేంద్రంలోనూ, రాష్ట్రాల్లోనూ ఏర్పాటు చేయబడినవి. ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదులో కూడా స్త్రీ విద్యాభివృద్ధికై ప్రభుత్వమే కాక, ప్రైవేటు సంస్థలు అనేకమూ అకుంఠిత దీక్షతో బృహత్తర ప్రయత్నాలను కొనసాగిస్తున్నాయి. గణనీయమైన కృషిని సాధిస్తూనే ఉన్నాయి.

## 80 వేలమంది మహిళల విద్యాభ్యాసం

హైదరాబాదులో ప్రస్తుతం ప్రాథమిక దశలో విద్యనభ్యసిస్తున్న బాలికలు (బాలుర పాఠశాలల్లో), మరియు ప్రత్యేకంగా బాలికల పాఠశాలల్లో చదువుతున్న బాలికలు సుమారు 30 వేలకు పైగా ఉన్నట్లు ప్రభుత్వం వారి లెక్కలు తెలుపుతున్నాయి.

అదేవిధంగా సెకండరీ విద్య పొందుతున్న బాలికలు (బాలికల పాఠశాలల్లో) 30 వేలు, మిగిలిన పాఠశాలలో 10 వేలూ ఉన్నారు. రాజధానిలో స్త్రీలకు ప్రత్యేకంగా 9 హైయ్యర్ సెకండరీ పాఠశాలలు, 17 మాధ్యమిక పాఠశాలలు, 22 ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. మహిళా కళాశాలలు నాలుగు— ఉస్మానియా విశ్వవిద్యాలయపు అనుబంధ మహిళా కళాశాల, రాజా బహద్దూర్ వెంకట్రామారెడ్డి మహిళా కళాశాల, సమాజసేవమండలి మహిళాకళాశాల, ఎగ్జిబిషన్ సొసైటీ నిర్వహిస్తున్న వనితా మహావిద్యాలయమూ— ఉన్నాయి. ఈ నాలుగు కాలేజీల్లోనూ, నగరంలోని ఇతర కాలేజీల్లోనూ, విశ్వవిద్యాలయంలోనూ సుమారు నాలుగువేల మంది స్త్రీలు ఉన్నత విద్య నభ్యసిస్తున్నారు.

## నవశకోదయానికి శుభసూచకం

సాంప్రదాయకంగా స్త్రీలు పనిచేసే రంగాల్లోనే కాకుండా, క్రొంగ్రొత్త రంగాల్లోనూ నవోత్సాహంతో, విజ్ఞానదాహంతో, నేటి భారతీయస్త్రీలు ప్రవేశిస్తున్నారు. ఇంజనీరింగు కళాశాలలో బరువైన ఇనుప గొలుసులను సైతం ఉపయోగిస్తూ సర్వే పని కావిస్తున్న కోమలాంగులను చూసి ఆశ్చర్యపడవలసిన, దిగ్భ్రాంతి చెందవలసిన రోజులు మారినవి. ఈ వినూత్న పరిణామాల కనుగుణ్యంగా స్త్రీలకు సాంకేతిక విద్యలు, వృత్తి విద్యలు గరపడానికి హైదరాబాదులో పెక్కు ప్రత్యేక విద్యా సంస్థలు స్థాపించబడ్డాయి.




ఈ నాటి స్త్రీకి కూడా అనువర్తించే నూత్న వ్యవస్థలు రూపు రేఖలు దిద్దుకోవడం నవశకోదయానికి తప్పకుండా శుభసూచకం. ఆధునిక విజ్ఞాన శాస్త్రరీత్యా స్త్రీలను ఆదర్శగృహిణులుగా తీర్చడానికి బృహత్ప్రయత్నాలు త్వరితగతిన కొనసాగుతున్నాయి. అట్టి సంస్థల్లో ప్రభుత్వం నిర్వహిస్తున్న గృహ నిర్వహణ శాస్త్ర శిక్షణ కళాశాల ఒకటి. ఇక్కడ ఉత్తీర్ణులైన విద్యార్థినులు అనేక రంగాల్లో కూడా ఉద్యోగాలు నిర్వహించడానికి యోగ్యతలు పొందుతున్నారు. ఉపాధ్యాయినులుగా, గ్రామసేవికలుగా, సాంఘిక సంక్షేమ కార్యకర్తలుగా రూపొంది, సమాజ సేవకు పూనుకోవడం విశేషం. ఈ కళాశాలలో రెండు విధములైన కోర్సులు నడుప బడుతున్నవి. ఒకటి : గృహనిర్వహణలో రెండు సంవత్సరాల డిప్లొమా కోర్సు. రెండు : గృహ నిర్వహణ శాస్త్ర ఉపాధ్యాయినులకు ఒక సంవత్సరం కోర్సు. హెచ్. ఎస్. సి. (లేక మెట్రికు) పరీక్షలో ఉత్తీర్ణులైన వారికి మొదటి కోర్సులో ప్రవేశం కల్పించబడుతున్నది. ఈ కళాశాలలో 32 మందికి సరిపోయే హాస్టలు వసతి కూడా ఉన్నది.

## స్త్రీల తొలి పాలిటెక్నిక్

వివిధ వృత్తి రంగాల్లో శిక్షణ గరపుటకై ప్రభుత్వం ఒక బాలికల వృత్తివిద్యా సంస్థను కూడా నిర్వహిస్తున్నది. ప్రతి సంవత్సరమూ ఈ పాఠశాలలో చేరే బాలికల సంఖ్యలో కాన్పిస్తున్న క్రమాభివృద్ధి ఈనాడు ప్రగతి మార్గంలో పురోగమిస్తున్న నవ సమాజానికి ప్రతిబింబం. విద్యారంగంలో లభ్యమవుతున్న నూతనావకాశాలను ఈ నాడు మధ్యతరగతి కుటుంబ స్త్రీలు అత్యుత్సాహంతో వినియోగించుకుంటున్నారు. ఇలాంటిదే మరో మహత్తర సంస్థ ఎగ్జిబిషన్ సొసైటీ వారిచే నిర్వహించ బడుచున్న స్త్రీల పాలిటెక్నిక్. ఇది యావద్భారత దేశంలోనూ స్త్రీల కోసమే ప్రత్యేకంగా నిర్దేశించ బడిన తొలి పాలిటెక్నిక్. ఇందులో ఉచిత విద్యా బోధన గరపడం మరో విశేషం.

## రు. 11 లక్షలతో భవన నిర్మాణం

సివిల్ ఇంజనీరింగ్, రేడియో ఇంజనీరింగ్, ఫార్మసీ, ఆర్కిటెక్చరు, ఫుడ్ టెక్నాలజీ, సెక్రటేరియల్ ప్రాక్టీస్ వంటి ఆరుకోర్సులలో ఈ పాలిటెక్నిక్‌లో ఈ నాడు 450 మంది స్త్రీలు శిక్షణ పొందుతున్నారు. ఈ కాలేజిని రెండు షిఫ్టులలో నడిపి సుమారు వెయ్యి మంది స్త్రీలకు విద్యా సౌకర్యాలు కల్పించేందుకు పాలకవర్గం యోచిస్తున్నదంటే, వృత్తి విద్యల పట్ల రాజధానిలోని స్త్రీలకుగల సమధికోత్సాహం, ఆసక్తి, అనురక్తి అభివ్యక్తమవుతుంది.

1961లో స్వర్గీయ జవహార్ పండితునిచే పునాదులు వేయబడిన ఈ సంస్థ భవనం

11 లక్షల రూపాయల వ్యయంతో, ఆధునాతన ... ఈ సంవత్సరాంతానికి రూపొందనున్నది. ఇందులో
విద్యాబోధనా సౌకర్యాలతో, రాజధాని శోభను శిక్షణ పొందే స్త్రీల సౌకర్యార్థం వచ్చే సంవత్సరం
ద్విగుణీకృతం చేసే విధంగా సర్వాంగ సుందరంగా హాస్టల్ వసతి కల్పనకు కూడా పాలక వర్గం



ఒకానొక భవనపు నిర్మాణానికి బాలికలు 'శ్రమదానం' చేసి ఎంతగానో తోడ్పడ్డారు.



స్థానికంగావున్న కొన్ని కర్మాగారాల్లో పనిచేస్తూ మహిళలు జీవనోపాధిని ఆర్జించుకొంటున్న దృశ్యం.

# స్త్రీలకు ప్రత్యేకరంగా సంక్షిప్త విద్యాప్రణాళిక!...

యోచిస్తున్నదని శ్రీ శంకర్జీ ఈ రచయితకు చెప్పారు.

మామూలుగా ప్రతి స్త్రీ విద్యా సంస్థను ఎదుర్కొంటున్న సమస్యే వీరికీ ఎదురవుతున్నది. స్త్రీల ఏకైక జీవితాదర్శంగా (ఇంత వరకూ) తలంచ బడుచున్న వివాహం కాగానే, దాంపత్య జీవితంలో ప్రవేశించడంలో విద్యా జీవితానికి తిలోదకాలివ్వడం వల్ల సంవత్సర మధ్య కాలంలోనే విద్యార్థులను సంస్థలు కోల్పోవడం, తత్పర్యవసానంగా ఉద్దేశిత విద్యావకాశాలు నిరర్థక మవుతూ న్నాయని ఆయా రచయితకు ఉన్నతవర్గాలవారు కొందరు వివరించారు.

మన హిందూ సమాజంలో ఇప్పటికీ అమలులో వున్న సంప్రదాయాల పరిణామంగా కొన్ని వర్గాల స్త్రీలు దయనీయ పరిస్థితుల్లో చిక్కుకొంటున్న విషయం పాఠకులకు తెలియనిది కాదు. ఉదాహరణకు వితంతు స్త్రీలు : జీవిత మధ్య కాలంలో ఆకస్మికంగా భర్తలను కోల్పోడం వల్లనేమి, విద్య లేని కారణంగానేమి, ఇతరుల పోషణావకాశాలు లేకపోవడం వల్లనేమి, అతి శోచనీయ పరిస్థితుల్లో ఉంటూ జీవితాన్ని గుప్పిట్లో పెట్టుకొని బ్రతకవలసిన దుస్థితి కల్గుతున్నది.

నానాటికి ఉధృతంగా పెరిగిపోతున్న జీవన వ్యయ ప్రమాణాల కారణంగా, ఈనాడు స్త్రీ కూడా తన కుటుంబ నిర్వహణకు కావలసిన ఆర్థిక సంపత్తులను సమకూర్చుకోవడంలో భర్తకు వెన్నీళ్లకు చన్నీళ్లుగా సహకరించవలసిన అవసరం ఏర్పడినది.

పరిస్థితుల ప్రాబల్యం వల్ల ముక్కుపచ్చలారని వయస్సులోనే తప్పటడుగులు వేసిన స్త్రీలను ఉద్ధరించాలంటే, అట్టివారు స్వయం కృషితో జీవనోపాధి గడించుకోగల సమర్థతను, విజ్ఞానాన్ని ఇట్టి స్త్రీలకై రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక విద్యా పథకాన్ని అమలుపరుస్తున్నారు. ఈ స్త్రీలు సాధారణంగా కొద్దో గొప్పో చదువుకుని ఉంటారు. వారు సాధారణ పాఠశాలలో చేరి ఏ మెట్రిక్ వరకో చదివి స్వయం పోషక శక్తిని ఆర్జించుకోవడం అనూహ్యమైన విషయం. కనుకనే అట్టిదీన జాతి స్త్రీలకొరకై రూపొందించబడిన ఈ పథకం క్రింద మూడు సంవత్సరాల కాలంలో 8వ తరగతి వరకు సాధారణ విద్య గరపడమే కాదు, ఉపాధ్యాయినీ శిక్షణ కూడా వారికి ఇవ్వబడుతున్నది. తద్వారా వారు గౌరవప్రద జీవనాన్ని గడిపే అవకాశమూ కల్పించబడుతున్నది. ఈ శిక్షణా కాలంలో ప్రభుత్వం వీరికి నెలకు రు. 30 లు స్టైఫండుకూడా ఇస్తుంది. హైదరాబాదులోని మాసాబ్‌టాంక్ వద్ద గల ఈ ప్రత్యేక విద్యా సంస్థలో ప్రస్తుతం 40 మంది స్త్రీలు ఉన్నారు. శిక్షణా కాలం పూర్తి అయిన తర్వాత, ఉద్యోగ నియామక సందర్భంలో వీరికి మిగతావారికన్న అగ్ర ప్రాధాన్యం ఇవ్వడం వీరికి కల్పించ బడిన మరో ప్రత్యేక సౌకర్యం. అయితే ఇలాంటి సౌకర్యాలు దుర్వినియోగం కాగల సందర్భాలు కూడా ఉన్నాయన్న విషయం తెల్సుకున్న ఈ రచయిత ఆశ్చర్య చకితుడయ్యాడు. దిక్కులేని స్త్రీల కోసం ఉద్దేశించ బడిన ఈ కోర్సుల్లో కూడా సంపన్న కుటుంబాల స్త్రీలు పూసుపోక చేరుతున్న కారణంగా ఎక్కువ మంది బీద స్త్రీలు అవకాశాలను కోల్పోతున్నారు. అదీగాక, జీవితాన్ని సక్రమ పంథాలో కొనసాగించాలన్న సదుద్దేశ్యంతో ఈ సంస్థలో చేరిన ఈ దిక్కులేని స్త్రీలను కొంత మంది దుర్జనులు బంధువులమనే సాకుతో వెన్నాడుతూనే ఉన్నారనీ, ఈ సమస్యా పరిష్కారానికి గాను ఈ సంస్థను ఇక్కడి నుండి ఏదో మారు మూరు మూలలోని గ్రామానికి తరలించే పరిస్థితి ఏర్పడుతున్నదనీ అధికార వర్గాలవారు ఈ రచయితకు ప్రత్యేక గోష్ఠిలో వివరించారు.

## సంక్షిప్త విద్యాప్రణాళిక :

దాదాపు ఇలాంటి పథకమే మరొకటిరాష్ట్రంలో పెక్కుచోట్ల మహిళా సంఘాలచే నిర్వహించ బడుతున్న స్త్రీల సంక్షిప్త విద్యాప్రణాళిక. పరిస్థితుల వత్తిడి ఫలితంగా విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పినట్టి 5—6 తరగతుల వరకు చదువుకున్న స్త్రీలు, ఈ ప్రణాళిక క్రింద గౌరవప్రదంగా ధనార్జన కావించుకోవడానికి గాను, తగిన విద్యా యోగ్యతలు సంపాదించుకో గలరు. రెండు సంవత్సరాల సంక్షిప్త కాలంలో వారివారి మేధాశక్తిని బట్టి 8వ తరగతి పరీక్షకో, మెట్రిక్ పరీక్షకో కూర్చోవడానికి వీలు కల్పించ బడుతున్నది.

## స్వచ్ఛంద సంస్థలకృషి

రాజధానిలోని ఆంధ్ర మహిళా సభ స్త్రీనివాస్, ఇందిరా సేవాసదన్ అనుమూడు స్వచ్ఛంద సంస్థల ఆధ్వర్యాన ఈ ప్రణాళిక నిర్వహించ బడుతున్నది. ప్రతి సంస్థలోనూ 25 మంది స్త్రీలకు మించకుండా ప్రవేశానుమతి కల్పించబడుతున్నది. వీరికి నిర్బంధ హాస్టల్ వసతి కూడా ఉన్నది. ఈ రెండు సంవత్సరాల కాలానికి కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు ప్రతి సంస్థకు రు 30 వేలు గ్రాంటు ఇస్తున్నది. ఈ సంస్థలలో ప్రశంసనీయమైన కృషి కొనసాగుతున్నది.

హైద్రాబాదులో స్త్రీలకు ప్రత్యేక పాఠశాలల కొరత తీవ్రంగా ఉంది. ప్రస్తుతమున్నట్టి కొన్ని పాఠశాలల భవనాలలో అపరిశుభ్రత, అభద్రత, స్థలాభావమూ లేకపోలేదు. శాస్త్రీయ పరికరాల, క్రీడా స్థలాల కొరత కూడా ఉంది. ముఖ్యంగా హాస్టల్ సౌకర్యాలు లేవు. అందువల్ల తల్లిదండ్రులు తమ పిల్లలను పాఠశాలలకు పంపడానికి విముఖత చూపిస్తున్నారు. వృత్తి విద్యా, సాంకేతిక విద్యా సంస్థలను కూడా ఈ సమస్యలు ఎదుర్కొంటున్నాయి. ప్రభుత్వం ఈ విషయమై సత్వరమే తగు చర్యలు గైకొంటే, హైద్రాబాదులో స్త్రీ విద్య సర్వతో ముఖాభివృద్ధిని సాధించి, నవశకోదయ ఆవిష్కరణకు నాంది ప్రస్తావన జరగగలదని ఆశిద్దాం.



# ఎవరెవరు? ఎందరెందరు!

## గంటి రామలింగం

| |
|---|
| భారతదేశం జనాభాలో... |
| స్త్రీలు ... ...... 21,29,41,462. |
| పురుషులు .......22,62,93,620. |
| ఆంధ్రప్రదేశ్ జనాభాలో... |
| స్త్రీలు ... ...... 1,78,21,776. |
| పురుషులు ......1,81,61,671. |

**ఒకప్పుడు, అంటే చాలా కాలం కిందట, భారతదేశం స్త్రీల పరిస్థితి చాలా బాగా ఉండేదిట. వారసత్వం ఆడవారికే ఉండేదిట. కేరళలో 'మరుమక్కతాయం' దానికి నిదర్శనం (అంటారు.) ఇది నిజమేనేమో.**

కాని, చరిత్రలో అధికారం చలాయించ గలిగే పదవులని ఆక్రమించిన స్త్రీల సంఖ్య ఎంత పెద్దది? వెనక్కి చూసుకుంటూ పోతే, ఝాన్సీరాణి, రుద్రమ్మ, చాంద్ బీబీ ఇంకా ఎందరు? కష్టపడితే మరి కొన్ని పేర్లు చెప్పవచ్చేమో!

### నేడు

ఇదలా ఉంచి, నేడు, 20వ శతాబ్దంలో, భారత దేశంలో, స్త్రీల పరిస్థితి ఎలా ఉంది అని ప్రశ్నించినా వివి సంతోషించతగ్గ సమాధానం రాదు. వరకట్నం అనే 'సంస్థ' దీనికి తార్కాణం ఇది చదువుకున్న వర్గాలలోనే ఎక్కువగా ఉండటం గమనించ తగ్గ విషయం

కాని మొత్తం మీద, రోజు రోజుకీ, స్త్రీ జనోద్ధరణ ఉద్యమం ముందుకే జరుగుతోందని ఒప్పుకోవచ్చు ఒప్పుకుని— నేడు అధికారం కల పదవులలో స్త్రీల సంఖ్య ఎలా ఉంది అని ప్రశ్నించుకో వచ్చు! ముఖ్యంగా ప్రభుత్వోద్యోగాలు రాజకీయాలకి సంబంధించిన పదవులు— వీటిలో ఆడవారు 'కావలసిన'ంత మంది ఉన్నారా? అని చూడాలి

పై నుంచి కిందికి వస్తే (అంటే పెద్ద పదవుల నుంచి చిన్న పదవు కి వెడితే) మన పరీక్ష తేలికగా ఉంటుంది (మరీ చిన్న ఉద్యోగాల సంగతి పట్టించుకొనక పోవటమే మంచిది గుమాస్తాలుగా, ఆఫీసర్లుగా, డాక్టర్లుగా ఎందరు స్త్రీలు పనిస్తున్నారో అందరికీ తెలుసు)

దేశంలో అందరికన్నా ముఖ్యవ్యక్తి రాష్ట్రపతి! ఇంకా ఆ పదవి పురుషుడిదే ఉపరాష్ట్రపతి పదవి విషయంలో అంతే . .

తర్వాత గవర్నర్ల జాబితా చూద్దాము మహారాష్ట్ర గవర్నర్ శ్రీమతి విజయలక్ష్మి పండిట్ కలకత్తా రాజభవన్ ముఖ్యవ్యక్తి స్త్రీయే, సరోజిని నాయుడు కుమార్తె కుమారి పద్మజ నాయుడు

ఇక ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రి (జి) శ్రీమతి సుచేతా కృపలాని

కేంద్ర ప్రభుత్వంలో మం(త్రులు) త్రులలో ముఖ్యమైన వారు— శ్రీమతులు ఇందిరాగాంధీ, సుశీలానయ్యార్, లక్ష్మి మీనన్‌లు.



ఇందిరా గాంధీ



సుచేత కృపలాని

| రాష్ట్రం | రాష్ట్ర సభలు | | పార్లమెంటు | |
|---|---|---|---|---|
| | మొత్తం | స్త్రీలు | మొత్తం | స్త్రీలు |
| ఆంధ్రప్రదేశ్ | 391 | 18 | 61 | 5 |
| అస్సాం | 105 | 04 | 19 | 3 |
| బీహార్ | 415 | 25 | 75 | 7 |
| గుజరాత్ | 159 | 15 | 33 | 2 |
| కేరళ | 126 | 07 | 37 | 2 |
| మధ్యప్రదేశ్ | 289 | 11 | 47 | 6 |
| మద్రాసు | 269 | 16 | 59 | 4 |
| మహారాష్ట్ర | 343 | 18 | 65 | 1 |
| మైసూరు | 239 | 20 | 38 | 3 |
| ఒరిస్సా | 140 | 03 | 30 | 1 |
| పంజాబ్ | 205 | 12 | 33 | 1 |
| రాజస్థాన్ | 176 | 06 | 32 | 1 |
| ఉత్తర ప్రదేశ్ | 539 | 26 | 120 | 6 |
| ప. బెంగాల్ | 331 | 10 | 52 | 3 |

గమనిక: జాబితా '62 లో జరిగిన ఎన్నికలననుసరించి చేసినది!



దుర్గాబాయ్ దేశముఖ్

రాష్ట్ర ప్రభుత్వాలలో మంత్రి పదవులలో ఉండే కొందరు— ఆడవారు.

1. సదాలక్ష్మి (ఆం. ప్ర)
2. సుమిత్రాదేవి (బీహార్)
3. ఇందుమతి చిమన్‌లాల్ (గుజరాత్)
4. కె. బారువా (అస్సాం)
5. రాణి పద్మావతి దేవి (మధ్యప్రదేశ్)
6. జ్యోతి వెంకటాచలం (మద్రాసు)
7. నిర్మలా ఖోస్లే (మహారాష్ట్ర)
8. యశోదర దాసప్ప (మైసూరు)
9. గ్రేస్ టక్కర్ (మైసూరు)
10. సరస్వతి ప్రధాన్ (ఒరిస్సా)
11. కమలా బెన్జివాల్ (రాజస్థాన్)
12. అభయ్ మైతి (ప. బెంగాల్)

కనీసం డజనువుంది !

ఇక అధికా (రిణు)రుల సంగతి—

1. అస్సాం పబ్లిక్ సర్వీస్ కమిషన్ అధ్యక్ష పదవిలో శ్రీమతి బొణిలి ఖోంగ్‌మెన్ ఉంది.

2. బీహార్ పార్లమెంటరీ సెక్రటరీలలో ఇద్దరు ఆడవారు— శ్రీమతులు మనోరమాపాండే, సుమిత్రాదేవి— ఉన్నారు.

3. కుమారి మర్త్రైకార్; మద్రాసుకి డైరెక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసెస్.

4. డా. శ్రీమతి శర్మ మద్రాసు రాష్ట్రం పబ్లిక్ హెల్త్ డైరెక్టర్.

శ్రీమతి దుర్గాబాయి (దేశ్‌ముఖ్) విషయం చెప్పనే అక్కరలేదు. ఏ పదవిలో ఉన్నా ఆమె ప్రాముఖ్యం తగ్గదు.

పైన చెప్పిన వాటికన్నా చిన్న పనుల వివరాలు తిరగవేస్తే చాలా ఆడపేర్లే కనిపిస్తాయి. ఎన్ని కనిపిస్తే స్త్రీ స్వాతంత్రోద్యమం అంత ముందుకి సాగినట్లు. . .

## వ్యాపారంలో

వ్యాపారంలో స్త్రీల పరిస్థితి ఎలా ఉంది ? సింధియా (నావిక), కంపెనీ అధిపతి (ల్ని? !), శ్రీమతి సుమతి మొరార్జీ, బ్రిటిష్‌రాణి ఎలిజబెత్‌తో బాటు, ప్రపంచంలో కెల్లా ధనవంతురాల్లయిన స్త్రీగా పరిగణించవచ్చునని ఒక వార్త వెలువడింది.

సినిమాలలో (నటుల రేట్లే ఎక్కువ అనే వదంతి ఉన్నప్పటికీ), 'ఆడవారిదే పై చెయ్యి' అనే సిద్ధాంతానికి బజార్లలో కనిపించే పోస్టర్లూ, పత్రికల ముఖ చిత్రాలు— ఇవే తార్కాణాలు! ★

# చిన్నపిల్లలకు నిక్కర్లు!

సుమారు 7, 8 సంవత్సరాల వయస్సు పిల్లలకి సరిపోయే నిక్కర్ల 'డిజయిన్' ఇస్తున్నాను. పెద్దవారి పాతలాగూ (పొడుగువి)లు కింద చిరిగి పోతే కూడా వాటిని నిక్కర్లుగా మార్చుకోవచ్చు.

**కొలతలు :**

పొడుగు : 12 అం, నడుము : 22 అం, సీటు 24 అం, కాలు అంచు, చుట్టుకొలత : 20 అం.

కొలతలు కొంచెం మార్చికుట్టినా, పొడుగు మొత్తం కొలతలో సగం ఉండేట్లు చూడాలి. ఇక్కడ 12 అం. దీనినే కొందరు 'మూల కొలత' అంటారు.

**ముందు భాగం :**

1—0=10½ అంగుళాలు, (పొడుగులో నుంచి 1½అం. తగ్గించాలి.నడుము పట్టాకన్నమాట)

2—1=2 అం. (అంచు మడత)

3—0=6½ అం. (పిర్రల చుట్టూ భాగం, 2 . అం.లో ⅓ భాగం, అంటే 8 అం.లో నుంచి 1½ అం. తీసెయ్యాలి.)

4—0=8 అం. (నడుములో ¼ కి 2½ అం. కలపాలి

5—3=8 అం.

6—5=2 అం. (12 అం.లో ⅙ భాగం)

7—5=4 అం. (12 అం.లో ⅓ భాగం.)

8—5=1 అం.

9—6= ¾అం.

10—1=10 అం.

11—10= 2 అం.

12—3=2 అం. (12 అం.లో ⅙ భాగం)

13—0=2½ అం. (రెండో నిలువు కుచ్చెళ్ల మడత)

14—4=2½ అం. (మొదటి నిలువు కుచ్చెళ్ల మడత)

బొమ్మలో చూపించిన విధంగా అంకెలన్నిటిని కలిపి కింద చెప్పినట్లు వెనక భాగానికి కావలసిన గుర్తులు వేసుకోవాలి.

15—0=10½ అం.

16—15=2 అం.

17—18=1 అం. 18—9 నికలపండి.

18—0=6½ అం. (నడుములో పావు భాగానికి 1 అంగుళం చేర్చాలి.)




ముందుభాగం, వెనుక భాగం వేరువేరుగా కత్తిరించుకుని, కాగితం మడత వేసిన బట్టమీద పెట్టి కత్తిరింపులు చేసుకోవాలి. ఒక వెనుకభాగం, ఒక ముందు భాగం కలుపుకుని రెండు చెక్కలనీ కలిపి కుట్టాలి. 22 నుంచి 18 వరకూ కుట్టకుండానే ఉండి ఉంటుందికదా ! ఈ అంచులు కలిపి కుట్టెయ్యాలి. 6 నుంచి 4 దాకా ముందు గుండీల భాగం.

19—7-8 అం. (స్ట్రెయిట్ పొట్టు కొలతకి 2 అం. కలపాలి)

21—20-3 అం.

22—6-1 అం.

23—11-1 అం.

18, 7, 22 అని బొమ్మలో చూపిన విధంగా కలపాలి.

18, 7, 22ల వంపు దగ్గర, అంచుల మీద, ¼ నుంచి 1 అం. దాకా వదలాలి. 22—23 నిలువు గీత తిన్నగా అంతే.

**గమనిక :**

ముందు భాగం బొమ్మ మొదట వేసుకోవాలి. కత్తిరించి, మరొక కాగితం మీద ఉంచి వెనుకభాగం బొమ్మ వేసుకోవాలి. ఇలా ప్రారంభిస్తే మంచిది.

**బెల్టు :**

2 అం. వెడల్పు, 15 అం. పొడవూ ఉన్న ముక్క అని బెల్టుగా కుట్టుకోవాలి.

**ముందు గుండీలుండే భాగం :**

గుండీలు కుట్టిఉండే భాగం— గుండీలు పట్టే చిల్లులున్న ముక్క కిందగా ఉండే భాగం అన్న మాట—వేరుగాకత్తిరించుకుని లాగూకి అతకాలి.

'ఏమ్మెస్సార్'

# వనితా వాణి

## మడీ ఆచారం

రోజులుమారే కొలది మనుష్యులు కూడ మారుతున్నారు. కాని మన పెద్దలలో ఉన్న ఈ "మడీ—ఆచారాలు" మటుకు మారటంలేదు. స్నానంచేసిన తరువాత ఎవరైనా చూస్తే చాలు అని తిరిగి స్నానం చేస్తుంటారు (కొందరు) స్నానాల మీద స్నానాలు చేస్తూ తడి బట్టలలో మునిగితేల్తూ ఉంటే ఆరోగ్యం దెబ్బతింటుంది. బజారులో కొన్ని వస్తువులను "మడి—గిడి" అని కడిగినవే కడుగుతూ, చేసిన పనే చేస్తూ భోజనం ఏ 2 గంటలకో తయారుచేస్తారు. వారి మడి, గిడిలమాట భగవంతుని కెరుక. టైముకు భోజనంలేక పెవక వారి ఆరోగ్యం పాడవుతుంది. ఈ "మడి—ఆచారము"లు అన్నవి ఉండవలెను కాని అవి పెచ్చు మీరితే మటుకు చాల అనర్థకం. మన పెద్దలు కూడ అర్థం చేసుకొని మసలుతే చాలా మంచిది.

కె. సుజాత (మోరి)

*   *   *

"మడి—ఆచారము" అన్న వ్యాసం బాగుంది. అయినా ఈ మడి అన్నది శుభ్రత గురించి అయితే బాధలేదు. లేకపోతే రాత్రి కట్టుకున్న బట్టలేనా మార్చకుండా, స్నానమేనా చెయ్యకుండా వంట వండేవారున్నారు. పిల్లలు చాలామంది "మడి" అనక పోతే అన్నిటిలోను కలబడి ముట్టుకుని నానా అల్లరి చేస్తారు. శుభ్రత లేకుండా మాకు మడి అంటూ నాలీచాలని బట్టలు కట్టుకుని నానా హంగామా చేసేవాళ్ళు చాలామంది ఉంటారు. అలాటివారి ఇంట్లో మంచినీళ్ళు అడగటానికి కూడా భయం లేకపోతే కాఫీ పెట్టుకున్న కుంపటి, పాలు కాచిందుకు పనికిరాదని నిప్పులకు దగ్గరనుంచి కడిగేస్తే అది ఆచారమా ? ఏది ఏమైనా అపరిశుభ్రతవు ఆచారము ఉన్నవాళ్ళు అది వదిలేస్తే రచయిత్రి ఆ వ్యాసం రాసినందుకు కొంచెం అయినా నయం.

ఎస్. లక్ష్మీపాప (చక్రధర్‌పూర్)

*   *   *

నిజానికి అనూరాధగారు వ్రాసినట్లు మడి,అంటు, తడిబట్టలు కట్టుకొని వంటచేయుట చాల అలస్యం. పిల్లలున్నవారైతే మరీ కష్టం. ప్రతిసారి వాళ్ళ తాకటం, మళ్ళీ గుడ్డలు తడుపుట ఆరోగ్యమునకు అంత మంచిదికాదు. శుభ్రముగా పొడిబట్టలు కట్టుకొని వంటచేస్తే అదే ఎంతో మంచిది. పైగా వంట కూడా త్వరగా తెములుతుంది. చాలామంది ఈ రోజుల్లో మడి అనే విషయాన్ని వెనుకకు నెట్టివేసినారు. మడిని ఎక్కువగా అచరించేవాళ్లకు చాల బాధ. పైగా విశ్రాంతి కూడ ఉండదు. మడి ఎక్కువగా ఆచరించేవాళ్ళు ఈ వ్యాసం చదివైనా తగ్గించుకుంటా రనుకుంటాను.

బి. శోభారాణి (అల్వారు)

# వంటలు

## అవియల్

**కావలసిన వస్తువులు :—**

ఈ క్రింది కూరలన్నియు ¼ కిలోగ్రాం చొప్పున వేయవలయును. దాన్నిబట్టి మనకు కావలసినంత చేసుకోవచ్చును.

అనపకాయ, గుమ్మడి, అరటికాయ—1, అలుగడ్డ, కాలీఫ్లవర్—1 (చిన్న పువ్వు), దొండకాయ, క్యాబేజి (చిన్న పువ్వు), బూడిద గుమ్మడికాయ, ములక్కాయ, బీన్సు, గోరు చిక్కుడు, కేరట్, కొబ్బరికాయ—1, పుల్ల పెరుగు ఒక కప్పు, మంచి కొబ్బరి నూనె రెండు టేబుల్ స్పూన్స్. పచ్చి మిరపకాయలు—10.

**వేయు విధము :—**

పైన చెప్పిన కూరలన్నియు శుభ్రముగా కడుక్కొని ముక్కలుగా కోసుకోవలయును. స్టవ్‌పైన ఒక స్టీలుపాత్ర ఉంచవలయును. దానిలో ముక్కలన్నియు వేసి, తగినంత ఉప్పు, నీరు కొంచెముగా పోసి మూతవేయవలయును. 15 ని. పిదప ముక్కలన్నియు మెత్తగా ఉడికినతర్వాత, క్రిందకు దించుకోవలయును.

కొబ్బరికాయ, పచ్చి మిరపకాయలు మెత్తగా రుబ్బుకొని ఉంచుకొనవలయును. ఉడికిన ముక్కలలో ఈ ముద్దవేసి కలియబెట్టవలయును.

ఒక మూకుడులో ఒక స్పూన్ ఆవాలు, కొబ్బరి నూనెతో వేయించి కూరలో పొయ్యవలెను. ఇదంతా బాగా కలియబెట్టి, ముందర చెప్పిన కొబ్బరినూనె వేసి బాగుగా కలుపవలెను. కూరయొక్క వేడి కొంచెము తగ్గిన తర్వాత ఒక కప్పు పుల్ల పెరుగువేసి కలియబెట్టవలయును.

ఈ కూర, పూరీలు, చపాతీలలోనికి చాలా రుచిగా ఉంటుంది. అన్నములోనికి కూడా వాడుకోవచ్చును.

శ్రీమతి పద్మాలక్ష్మణ్, కుమారి మణి.

# షాపింగ్ బాగ్

దీనికి ఉన్నినీ వాడుకోవచ్చు, లేదా 'సిటింగ్ కాటన్' (దూదితో చేసిన దారం) వాడవచ్చు. రెండూ కాదనుకుంటే 'మక్రామె' ట్వయిన్ దారం ఉప యోగించవచ్చు. నెం.8,9సూదులు వాడుకోవచ్చు.

3 ప్లస్ 1 భాగించగలిగే స్టిచ్‌లు కాస్టాన్ చేసుకోవాలి.

1 వరస నిట్; తర్వాత ఈ క్రింది విధంగా :—

**మొదటి వరస :—** ని. 1, * ఉన్ని ముందుకి, స్లిప్ స్టిచ్ 1, ని 2, పాస్ స్లిప్ స్టిచ్ ఓవర్ (రెండు నిట్ స్టిచ్‌లపై). *గుర్తు తర్వాత భాగమంతా మరోసారి వేసుకోవాలి.

**రెండవ వరస :—** పర్ల్ వాడాలి.

**మూడవ వరస :—** ని.2,* ఉన్ని ముందుకి, స్లిప్ స్టిచ్ 1, ని.2, పాస్‌స్లిప్ స్టిచ్ ఓవర్ (రెండు నిట్ స్టిచ్‌లపై). *గుర్తు తర్వాత చివరి 2 స్టిచ్‌లదాకా, ని. 2.

**నాలుగవ వరస**· పర్ల్— వాడాలి.

**ఐదవ వరస—** ని 3,* ఉన్ని ముందుకి, స్లిప్ స్టిచ్, ని.2, పాస్‌స్లిప్ స్టిచ్ ఓవర్ (రెండు స్టిచ్‌లు). *గుర్తు తర్వాత భాగమంతా, చివరి స్టిచ్‌దాకా ని 1



**ఆరవ వరస—** పర్ల్.

స్టిచ్‌ని 'శాంపిల్'గా వేసుకుని 'బిగువు' (టెన్షన్) ఎలా ఉందో చూసుకోవాలి. దాన్నిబట్టి మీకు కావలసిన సంచి సైజు నిర్ణయించాలి.

వెడల్పు నిర్ణయించుకున్న తర్వాత, కావలసినన్ని స్టిచ్‌లు 'కాస్ట్ ఆన్' చేసి 2 వరసలు ని. చెయ్యాలి.

**తర్వాతి వరస—** వూల్ ఫార్వర్డ్, ని.2 టుగెదర్, మొదట స్టిచ్ వేసి, వరసమీదుగా 'చిల్లులు' చెయ్యాలి.

నిట్‌లతో రెండు వరసలు వేసి కావలసినంత పొడుగు వేసుకోవాలి.

నిట్‌తో 2వరసలు;రెండవవరసచిల్లులువేసుకోవాలి.

ఒక వరస నిట్‌చేసి కాస్టాఫ్ చెయ్యాలి.

సంచి అంచులని 'ఫ్లాట్ స్టిచ్'లతో కలిపి, నాలుగు నిటింగ్ పేటలని ఒక 'తాడుగా' పేని కొనలని ముడి వెయ్యాలి.

ఇంకొక 'తాడు' కూడా పేనాలి.

కుడివైపు భాగంలో మొదలుపెట్టి, మొదటి 'తాడు'ని చిల్లులలోనుంచి లాగి కుడివైపే ముడి వెయ్యాలి. ఎడంవైపు పై భాగంలో ప్రారంభించి రెండవ 'తాడు'ని మొదటిదానికి ఎదురుముఖంగా ఎక్కించాలి. ఇవి రెండూ లాగితే సంచి మూసుకుంటుంది.

# ఉద్యోగినులకు చిట్కాలు!

## కొంపెల్ల సీతాబాయి

**ఈనాడు పలువురు వనితలు ఉద్యోగాలు చేస్తూన్నారు. గృహిణిగా సంసార కార్యభారాన్ని మోస్తూ, ఉద్యోగధర్మాన్ని నిర్వహించుకోవాలి. పిల్లలుంటే 10 గంటలలోగానే భోజనం పెట్టి దుస్తులిచ్చి బడికి పంపి భర్త ఉద్యోగియయితే ఆయనను కూడా ఆఫీసుకు పంపి తాను ఇల్లు కదలాలి. తను కూడా సకాలానికి ముందుగా తన ఆఫీసు చేరుకోవాలి.**

ఉదయాన్నే లేచినది మొదలు పనులు ప్రారంభించుకోవాలి. ముఖ్యమయినది వంట. వంట పని తొందరగా ముగుస్తే ఇతర పనులంత ఆలస్యం కావు. ప్రగతి నొందిన పాశ్చాత్య దేశాలందు వలె మన దేశమునందు తొందరగా వంట పని ముగించ కొనుటకు అవకాశములు అల్పములనులను మాట వాస్తవమే. అయినా నాకు తోచిన కొన్ని ఉపాయములను మీ ముందర నుంచడమే నా ఈ వ్యాస లక్ష్యం. నాకు లాగానే మీకు కూడా ఈ విషయాలుపయోగించితే నా పరిశోధన ప్రయోజనమయిన దని భావిస్తాను.

నేను కూడా ఉద్యోగినే. గృహిణిని కూడా. ఉపాధ్యాయినిని. తత్రాపి ఆంధ్రోపాధ్యాయినిని. కాంపోజిషన్ పుస్తకాలలోనే లోకాన్ని మరిచిపోవలసిన తెనుగు పండిత పదవి యందలి విరామము మీకు తెలిసియే యుంటుంది : అని ద్వేషించకూడదు. సరిగదా ! దానిని నిర్వహిస్తూ గృహిణీ ధర్మాన్ని విస్మరించరాదు కదా ! వంట పని తొందరగా పూర్తి చేసుకోవాలి. కొన్ని పరిశోధనలను నేను (నా గురువుగారు) భర్త ప్రోద్బలంతో రెండింటిని కలిసి చేసేము. అందు కొన్నింటిని వ్రాస్తాను.

ఒకటవ తేదీ నాడే మేము ఇంటికి నెలకు కావలసిన సరుకు నన్నింటిని తెచ్చుకుంటాము. కంది పప్పును వేయించి మెత్తగా పిండి పట్టించుకొంటాము. పెసరపప్పును పచ్చిదానినే మెత్తని పిండిగా పట్టించుకొంటాము. మినప పిండిని కూడా పట్టించుకొంటాము.

కందిపప్పు ఉడకడం కష్టం కనుక, చాలా ఆలస్యం కనుక దాని బదులు వేయించిన పై కంది పిండిని వాడుతాను. ఎసరు కాగేటప్పుడు వేరే గిన్నెలో కందిపొడిని వేసి సలసల కాగే ఎసరు నీళ్ళు పోసి మూత పెట్టుతాను. కొంత సేపటికి ముద్ద పప్పులా అయి ఉంటుంది. దీనిలో ఉప్పువేసి కలియబెట్టుకొని తినవొచ్చును. ఈ కంది పిండి ఎన్నింటికో ఉపయోగిస్తుంది. కాగే చింత పండు పులుసులో దీనిని వేస్తే పప్పు కూటవుతుంది. సాంబారుగా జేసుకొనవచ్చును కూడా. దీనిని చిక్కని చింతపండు పులుసుతో గలిపి తిరుగమోత లేక పోపు పెట్టిన కంది పచ్చడి యగును. చింత పండు పులుసునకు మారుగా నిమ్మకాయను వాడిన ఇంకను రుచిగా నుండును. పుల్లని మజ్జిగలో కలిపిన ఇడ్లీల పచ్చడిగా నుపయోగించును. పప్పు కూరలు వండ దలచిన సమయములలో కూరను బాగుగా నుడికించి నీరు లేకుండ వార్చి ఈ కంది పిండిని కలిపిన ఆ రుచి వచ్చును.

మామిడి వరుగులతో పప్పు వేయువలసిన వచ్చిన : మేము వేసవియందే మామిడి వరుగులను బాగుగా నెండబెట్టి మెత్తని పిండిగా చేసుకొని జాగ్రత్త పెట్టుకొంటాము. తగు మాత్రంగా ఆ పిండిని కందిపిండిని నికెల్ గిన్నెలో వేసి వేడి నీళ్ళు పోసి మూత పెట్టెదము. క్షణములో మామిడి వరుగులు పప్పు తయారగును.

పై సందర్భములన్నింటిలో పెసర పిండిని వాడినను వాడ వచ్చును. పెసరట్టులు వేసుకొన దలచినపుడు ఈ పిండిని నీళ్ళతో కలుపుకొని వెంటనే పెసరట్లు వేసుకొనవచ్చును.

మినపపిండిని రాత్రి ఇడ్లీ రవ్వతో కలిపి నానబెట్టుకొనిన మరునాడుదయముననే ఇడ్లీలుగా వేసికొనవచ్చును. మినపట్లకు దోసెలకు కూడాన నుపయోగించ వచ్చును. ఈ మినపపిండిని ఉప్మా రవ్వ వలె పట్టించుకొని నీళ్ళలో కలిపి ఇరువది నిముషముల అనంతరము గారెలుగా వేసుకొన వచ్చును. పెసర మినపప్పులు చాయ పప్పులయి యుండవలయును.

కూరల విషయంలో కూడా నిటువంటి మార్గమొకటి నున్నది. కూర ఉడికిన తరువాత పోపు (తిరుగమోత) పెట్టవలయును. టైం అయిపోవుతున్నదను హడావుడితో మిరపకాయ ముక్కలో, మినప పప్పో లేక మొత్తమో మాడిపోవుచుండును. దాని వలన మిగిలిన విషయము లెట్లున్నా రుచి పాడగును. ఇట్టి అవాంతరము సంభవించకుండా సాధారణంగా ప్రతి ఆదివారం తీరికగా వారానికి సరిపడిపోవు (తిరుగమోత) పదార్థములను సమముగా వేయించి ఒక సీసాలో జాగ్రత్త పరచుకొంటాను. సెనగపప్పు, మినపప్పు, మిరపకాయ ముక్కలు, పచ్చిమిరపకాయ ముక్కలు, కరివేపాకు, ఆవాలు, మున్నగునవి మన యిష్టానుసారం చేసుకోవచ్చును. వీనిని నూనెతో నిలవచేస్తే మెతక వాసన వచ్చే ప్రమాదముంది. గాలి తగులుతే మెత్తబడి పోతాయి. కనుక మూతను జాగ్రత్తగా చూసుకోవాలి. కూరను ఉపయోగించుకొనేటప్పుడు వీటి నుండి తగు మాత్రంగా తీసి కలుపుకొంటే చాలును. చాలా తాజాగా ఉంటుంది. దీనిని పచ్చళ్లల్లో కూడ కలుపుకొనవచ్చును. ఉప్మా చేసుకొనునప్పుడు నూకను నీళ్ళలో నుడికించి పిదప ఈ పోపును (తిరగమోతను) కలుపుకొంటే చాలా బాగుంటుంది.

వంటకు కట్టెలకన్నా బొగ్గులు శ్రేయస్కరం కుంపటి నిండుగా బొగ్గులువేసి దాని మీదొక పదార్థం పడవేసి అది ఉడికేలోగా యితరములయిన పనులను చేసుకొనచుండవచ్చును. ఈ ఆధునాతన దినములలో కిర్సను స్టౌలు, ఎలక్ట్రిక్ స్టౌలు కూడ వచ్చియున్నది. ఇవియు తొందరగా వంటను జేయునట్టివే గాని వంట యగు వరకు వీని వద్ద కూర్చొని యుండాలి. వేడి నీళ్ళకు బాయిలరు, కాఫీ టీలను నిలవ జేసుకొనుటకు ఫ్లాస్కులు మీకందరకును తెలిసినవే.

**వీటిని ఉద్యోగినులయిన స్త్రీలేగాక ఉదయం 10 గంటలకు ఆఫీసులకు వెడలవలసిన ఉద్యోగుల భార్యలు కూడా అనుసరించవచ్చునేమో? ఆలోచించగలరు సెలవు.** 






## జరిగిన కథ

విభిన్న మనస్తత్వాలు కల అయిదుగురు అమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయనకు మద్రాసులో వాచీల వ్యాపారం. రామయ్యగారి స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాసు చూడటానికి వచ్చి వాళ్లింట్లో దిగుతాడు. అమ్మాయిలందరూ అతని వాలకాన్ని రెండురోజులపాటు గమనించి త్వరగా సాగనంపటానికి పలువిధాల ప్రయత్నాలు చేస్తారు. కాని అవేవీ సుధాకర్ మీద పని చెయ్యవు.

## (గత సంచిక తరువాయి)

సుధాకర్ మనస్సు బాగుండక మోహన్ గదికి వచ్చాడు. దిగులుగా కనబడుతున్న సుధాకర్ భుజం తడుతూ "ఎందుకురా అంత దిగులు?" అని మోహన్ పరామర్శించాడు.

ఫర్నిచర్ లేని చిన్నగది— అదే మోహన్‌కు దేవేంద్ర భవనం. రెండు పూటలా హోటల్‌కెళ్లి భోంచేసి వస్తాడు. రాత్రి నిద్రపోయేలోగా వూళ్లో ఎన్ని స్టూడియోలున్నాయో వాటన్నిటిచుట్టూ తిరిగొస్తాడు. సినిమాల్లో చేరాలని మోహన్ ఉబలాటం. తలితండ్రులకి మాత్రం అది నచ్చలేదు. అందుకని తప్పనిసరిగా మోహన్ ఇంట్లోనుంచి కొంత డబ్బు పట్టుకుని రెండో కంటికి తెలియకుండా మెడ్రాస్ చేరుకోవలసివచ్చింది.....

ఒకనాటి తన క్లాసుమేటు అంత దిగులుగా ఉండటం చూసి మోహన్ మనస్సు అదోలా అయిపోయింది. సుధాకర్ విచారం పోగొట్టటానికి ఎన్ని కష్టాలైనా పడాలని నిశ్చయించుకున్నాడు.

మోహన్ పరామర్శతో సుధాకర్ మరీ క్రుంగిపోయాడు.

"దిగులు కాకపోతే మరేమిటి? ఆవిడ మాట్లాడటం మానేసింది........"

"ఎవ్వరా ఆవిడ?"

"అదే........ క......థ....!"

"కథ కోసమా ఈ కంగారు? ఏ మూగనోమైనా పట్టిందేమో! లేకపోతే హఠాత్తుగా మాట లెందుకు మానేస్తుంది?"

"ఏడ్చినట్టే ఉంది నీ తెలివి! నామీద గ్రా... అయితే ఇంట్లో హడావిడి లేకుండా ఉంటుందా [illegible]"

"మరెందుకనంటావ్?"

"అదే నాకు తెలియట[illegible]" అన్నాడు సుధాకర్.

మోహన్ కాస్సేపు మౌనంగా వుండి "నువ్వు ఇంకో అమ్మాయితో పరాచికాలేమైనా ఆడావా? ఒకవేళ అది ఆవిడ కంటబడి ఉంటుంది—" అన్నాడు.

"అలాంటిదేమీ లేదు.....కాని ఈ మధ్య గీత పలుచా పడుతుంటే నా ట్రాన్సిస్టర్ వాడుకో మని ఇచ్చాను......అంతే!"

మోహన్ సుధాకర్ భుజాలమీద గట్టిగా చరుస్తూ "ఓరి నీ! ప్రణయ కలహమన్నమాట? ఇంకా ఏమిటో అనుకున్నాను? వెళ్లి ఆవిడ కాళ్లు పట్టుకున్నావంటే మీ కలహం ఇట్టే గాలి కెగిరిపోతుంది......."

"ప్రణయ కలహమా? ప్రళయ కలహంలా ఉంటేను? ఆవిడ అసలు నా కంటపడటమే మానేసింది. ఇంక నేను ఆవిడ కాళ్లేం పట్టుకోను?"

"పోనీ, ఇంకో పని చేస్తేనో? ముందు గీతను ట్రాన్సిస్టర్ అడిగిపుచ్చుకో! ఆ తర్వాత ఆవిడకే సంగతంతా బోధపడుతుంది. నిన్ను అనవసరంగా బాధపెట్టినందుకు క్షమార్పణ కోరుకుంటుంది చూడు!"

"గీతనేనా అడగమంటున్నావ్? ఆవిడ్ని అడిగినా ఇచ్చేలాలేదు. అదీగాక నా సంగతి పసికట్టిందంటే అసలే ఇవ్వదు— అందులో వాళ్లిద్దరికీ ఒక్క క్షణం పడదుకూడా!"

మోహన్ నవ్వాడు.

"ఏది నువ్వడిగి తీసుకోవడానికికూడా హడలేనా? భేష్! గట్టి పిల్లలానే ఉన్నది!"

అదే నేననేది! నువ్వకసారి ఇంటికొచ్చి చూశావంటే నేను చెప్పేమాట నిజమో, కాదో నీకే తెలుస్తుంది!"

"గీతకు తెలియకుండా నీ గదిలోకి తెచ్చి పెట్టేసుకుందూ?" అంటూ మోహన్ సలహా ఇచ్చాడు.

"మరే! గీత అంత అజాగ్రత్త మనిషికాదు... ఆవిడ కన్నుపడిలో ఉన్న వస్తువేదీ బైటికి రావటం కష్టం!"

"అయితే నీ వస్తువు నువ్వు దొంగతనం చేయటానికికూడా వీల్లేదన్నమాట.........!"

[illegible] మాలుకుంటాను...... నువ్వకసారి ఇంటికొచ్చి ఆ ట్రాన్సిస్టర్ గీత దగ్గర్నుంచి ఎలా రాబట్టాలో చూసిపెడుదూ?"

"మరేం బెంగపెట్టుకోకు! పని నీ చేతిలో పెడతాగా!" అని ధైర్యం చెప్పాడు మోహన్.

"ఏం చేస్తున్నావురా మోహన్?"

మోహన్ తలెత్తి చూసి గుమ్మంలో నించున్న ప్రభాకర్ను చూసి "అరె! అదేమిటిరా? గుమ్మంలోనే నిలబడిపోయావ్? లోపలికొచ్చి కూర్చో!" అన్నాడు.

"అబ్బే! నాకు పనుందిరా......కన్నెమరాకు వెళ్లాలి.... ఒస్తు స్టాప్‌కు వెళ్తూ నీ రూం తలుపులు తీసుంటే చూసిపోదామని వచ్చాను..... మా ఫ్రెండెవరో వచ్చినట్టున్నారే?"

"సుధాకర్ నీకు తెలీదూ? గుంటూరులో కాలేజి లెక్చరర్‌గా ఉన్నాడు..... వాడు, నేను బి.ఏ.లో క్లాసుమేటులం...... అది సరేకాని నువ్వు కన్నెమరాకు వెళ్లటమేమిటి? ఈ సాహిత్యాభిలాష ఎప్పటినుంచి?"

"అంత పెద్దమాట ఎందుకు వాడ్తావుకాని, ఇది ప్రేయసికోసం వేస్తున్న వేషం..."

"డొంక తిరుగుడు మాటలు కట్టిపెట్టి అసలు విషయమేమిటో తొందరగా చెప్పు!"

"ఏమీలేదు! షీరో కోసం!"

"ఐసీ! షీరియా!"

ప్రభాకర్ వెళ్లిపోయాక మోహన్ "ప్రేమ కోసం వలలో పడెనే అయ్యో పాపం పసివాడు!" అని పాడాడు.

"ప్రభాకర్ మెడిసిన్ చదువుతున్నాడు...... అమ్మాయిల వెంటబడి మతి పోగొట్టుకుంటున్నాడు......!" అన్నాడు మోహన్ నవ్వుతూ సుధాకర్‌తో. కాస్సేపు కూర్చున్నాక సుధాకర్ పనుందంటూ లేచాడు.

మోహన్ తన కిష్టమైన బొమ్మల చొక్కా వేసుకుని బాగా ముస్తాబై రూంకి తాళం వేసి ఇవతలకొచ్చాడు. టి.నగర్‌కెళ్లే బస్సులో ఎక్కి కూర్చున్నాడు. బస్సు కిటకిటలాడుతూ ఉన్నది. కాస్సేపటికి తన పక్కనున్నాయన దిగిపోయాడు. అదేమీ గమనించుకోకుండా పొట్టిగా లావుగా ఉన్న ఒక ముసలాయన రాడ్ అందక, పడిపోకుండా నిలబడలేక అవస్థపడుతున్నాడు. మోహన్ తన పక్క ఖాళీగా ఉన్న జాగాను చూపించి ముసలాయన్ని కూర్చోమన్నాడు. ముసలాయన మాట్లాడకుండా మోహన్‌వంక చూసి తర్వాత సీట్లో కూర్చున్నాడు. మోహన్ "ఎక్కడకెళ్తున్నారండి?" అని పలకరించాడు అరవంలో.

ముసలాయన మళ్లా ఒకమాటు మోహన్‌కేసి చూపులు పారేసి మాట్లాడకుండా వూరుకున్నాడు. మోహన్‌కు అనుమానం వేసింది అరవం రాదేమో అని. అందుకని ఈసారి స్పష్టమైన తెలుగులో పలకరించాడు "ఎంత దాకా?" అని.

ముసలాయనకి గొంతుదాకా కోపం వచ్చింది.

"ఎక్కడో అక్కడ దిగుతాను నీ కెందుకయ్యా?" అని విసుక్కున్నాడు.

మోహన్‌కు ఆశ్చర్యంవేసింది. ముసలాయనకు మంచిమర్యాద తెలియనట్టున్నదే అనుకుని మరి



మాట్లాడించకుండా కిటికీలోనుంచి చూస్తూ కూర్చున్నాడు. కొంత సేపయ్యాక భుజంమీద చెయ్యి పడేసరికి మోహన్ ఇటు తిరిగాడు.

“గిండీకి వెళ్లాలంటే ఎక్కడ దిగాలి ?”

“గంగలో దిగండి.” అన్నాడు మోహన్ కసిగా.

ముసలాయన ముఖంలో రంగులు మారాయి. చరచరా కోపం ఎక్కుటంతో మరాచురా చూస్తూ “నన్ను గంగలో దిగమంటావయ్యా ? ఎంత పొగరు ? అని అరిచాడు.

“ఇందాకిలా కనుక్కున్నారుగా ? ఇప్పుడు మళ్లా నన్నెందుకు అడగటం ? గంగలో దిగాలని లేకపోతే గోదావరిలో దిగండి.”

“ఎంత తల బిరుసు ?”

“ఎంత నోటి దురుసు !”

ముసలాయన మండిపడ్డాడు.

“కుక్కకు మాటలు నేర్పితే ఇస్కో అంటే ఇస్కో అన్నదట !”

మోహన్ అంతకన్నా వూరుకోలేదు.

“నేను కుక్కనయితే మీరు నక్కా !”

ముసలాయన దుర్వాసుడిగా హుంకరించాడు.

“తాటాకు చప్పుళ్లకు కుందేళ్లు బెదరవు !”

అన్నాడు మోహన్.

ముసలాయన మండిపడుతూ సీట్లోనుంచి ధబీలుమని లేచి నించున్నాడు. తను నక్కకూడా కాదట ప్రాణంలేని తాటాకు ముక్కట ! వళ్లు మండదూ మరి ? మోహన్ పరాయివాడు కాబట్టి ప్రాణాలు దక్కాయి కాని......

బస్సులోవాళ్లంతా ఎంతో కుతూహలంగా చూస్తున్నారు సంభాషణ అర్థంకాకపోయినా.

“నేను తాటాకు ముక్కనా ? నీ నోటికి హద్దు, పద్దూ లేదూ ? నీ నాలిక చీలికలవా !”

“మీ తల పగులా !”

ఒక అరవ తెలుగాయన పోట్లాటలో తల దూర్చాను.

“విషయమేమి ?” అని ఆదుర్దాగా దర్యాప్తు చేశాడు. ఆయన నిజానికి తెలుగువాడే కాని తర తరాలుగా అరవంతో ఏర్పడిన పరిచయం ఆయన తెలుగుభాషా స్వరూపాన్ని అపహరించేసింది.

సానుభూతి చూపుతున్నట్టు పలకరించేసరికి ముసలాయనకు కొండందుకున్నట్టయింది.

“చూడవయ్యా ! ఈ కుర్రాడు నన్ను గంగలో దిగమంటున్నాడు !” అన్నాడు.

ముసలాయన ఏం మాట్లాడుతున్నాడో అతనికి అర్థంకాలేదు. మద్రాసులో గంగేమిటి అని కంగారుపడ్డాడు ఒక క్షణం !

“కాశీయాత్రకు పోతుండారా ? గంగలో దిగితే నిండా పుణ్యం ! అబ్బాయినిండా మంచి సలహా చెప్తే అట్టా ఎగుర్తావేమయ్యా ? నిండా మోసంగా ఉందే !” అన్నాడు చివరికి.

“చాల్చాల్లేవయ్యా ! నీ సాక్ష్యం నువ్వూను ? ఆ పొగరుమోతు వెధవను వెనకేసుకుని వస్తున్నావ్ ?”

# అయిదు రెళ్ళు

"మాటలు తిన్నగా రానియ్యండి. ఇక్కడ పొగరు మోతు లెవరూ లేరు ...." అన్నాడు మోహన్.

కండక్టర్ సీటు దగ్గర కొచ్చి "ఇద్దరూ మాట్లాడకుండా కూర్చుంటారా ? లేకపోతే దిగి పోతారా ?" అన్నాడు.

ముసలాయన గొణుక్కుంటూ కూర్చున్నాడు. లజ్ స్టాప్ లో ఆయన దిగి వెళ్ళిపోయాడు.

"అమ్మయ్య !" అని వూపిరి వదిలాడు మోహన్.

ఇంతకీ బయల్దేరినవేళ మంచిదికాదు.... పుణ్యానికిపోతే పాపం ఎదురయింది ! ఎక్కడికి వెళ్తారూ అని పలకరిస్తే ఎంత చేశాడు ముసలాయనకి మేకాయంత వెర్రి వున్నట్టుంది .... నాలిక చీలికలవా అని తిడతాడా ? నాలిక చీలికలైతే డైలాగు లెలా చెప్పడం ? పాటకు ప్లేబాకు పెట్టుకున్నా మాటలు కూడా ఎరువు తెచ్చుకుంటానంటే ఎవ రూరుకుంటారు ? నటుడు కావాలని తన పాట్లు ! ఏం గ్రహపాటో ముసలాయనచేత ఉత్త పుణ్యానికి చీవాట్లు తిన్నాడు !

## 4

"మోహన్ ! నన్ను గెస్ట్ లా ఎక్కిస్తావో ?" అన్నాడు సుధాకర్ మోహన్ తో కలిసి నడుస్తూ.

"పరేం బెంగపెట్టుకోకురా ! అంతా నేను సక్కబెడతానుగా ?" అన్నాడు మోహన్ రామయ్య గారింటి మెట్లు ఎక్కుతూ.

సుధాకర్ మోహన్ని తన గదిలోకి తీసుకెళ్ళాడు. 'ఆడదాని వోరచూపులో' అంటూ రేడియో పాడు తుంది గీత గదిలో నుంచి. అది రామయ్యగారు ఇంట్లో లేరనటానికి గుర్తు !

"ఆవిడ తెలుగు సినిమా పాటలంటే చెవులు కోసుకుంటుంది !" అని వివరించాడు సుధాకర్.

"అయితే ఆవిడకి ఇంతకీ ఇప్పుడు చెవు లున్నాయా, లేవా ?"

"వూరుకోరా నీ సెలావన కట్టిపెట్టి ! గోడకు చెవులుంటాయి.... నీ మాటలు వింటే లేనిపోని తంటా !"

"సరే మాట్లాడకుండా కూర్చుంటాను కాని ఇక్కడికి పిలుచుకుని వస్తావా ?"

"రమ్మంటే వస్తుందో, లేద ?" అని అనువా విస్తూనే సుధాకర్ గీత గదిలోకి వెళ్ళాడు. గీత శ్రద్ధగా సినిమా పాటలు వింటున్నది. సుధాకర్ దగ్గాడు. గీత కళ్ళతో పలకరించి నవ్వింది.

"నా ఫ్రెండ్ వచ్చాడు .... నాగదికోమాటు వస్తారా .... ?"

"మీ ఫ్రెండ్ సంగతేమిటో మీరు చూసుకోరే లేమిటి, నేను తోడు రావాలా ? .... ఆయన్ని ఒక్కడినే గదిలో పెట్టేసి వచ్చారా ? ఏం మర్యాదండీ !" అని నవ్వింది గీత.

ఇలా లాభం లేదనుకుని ఇంకో ఎత్తు వేశాడు సుధాకర్.

"మా మోహన్ కు గొంతుక తడి ఆరిపోతున్నది."

"ప్లీజ్ ! నన్ను డిస్టర్బ్ చేయకండి ! తెలుగు పాటలు వస్తున్నాయి ! మంచినీళ్ళు కావాలంటే ఇంకెవరినైనా అడగండి.... లేదా సోడా తెప్పించి యివ్వండి ...." అంది గీత.

మిరింక ... లాభం లేదనుకుని ... ప్రేలాడేసుకుని మోహన్ దగ్గర కెళ్ళాడు. మోహన్ సంగతంతా విని ఏం చేయటానికీ తోచక తల చేత్తో పట్టుకుని కూర్చున్నాడు ....

కాస్సేపయ్యాక "మీ ఫ్రెండ్ ఉన్నారా, వెళ్ళి పోయారా ?" అంటూ అల్లంతదూరం నుంచే ప్రశ్నిస్తూ వచ్చింది గీత.

మోహన్ ఎగిరి గంతేశాడు.

గీత ఉలిక్కిపడి "మీరా ?" అంది ఆశ్చర్యంగా.

సుధాకర్ ఇద్దరి ముఖాలకేసి విస్తుపోతూ చూశాడు.

"ఇదేమిటి ? మీ యిద్దరికీ ఇదివరకే పరిచయ ముందా ?" అని అడిగాడు.

"నేను సంగీతం పోటీ గురించి చెప్పానూ, చూడండి ? న్యాయం చెప్పిన పెద్దమనుష్యుల్లో

ఆయనొకరున్నా రని మరిచిపోయారా? "ఏమిటి ?" అంది గీత కోపంగా చూస్తూ.

ఆ వాతావరణంలో నిలబడటానికి ధైర్యం చాలక సుధాకర్ రూంలోనుంచి ఇవతల కొచ్చాడు.

"మీకు గుర్తుంటా వనుకోలేదు సుమండీ ?" అన్నాడు మోహన్ నమ్రతగా.

"మిమ్మల్ని జన్మలో మర్చిపోను ....! ఆ వసంతేం పాడిందని దానికి ఫస్టు ప్రైజు ? దానికి ఎలా గోలా మొదటి బహుమతి ముట్టచెప్పాలని నన్ను

## ఆ యిదు రెళ్ళు

అవ్యాయించేస్తే నా ఉసురు తగలకపోదా ఉంటుందా ?"

"మీ ఉసురు తగిలితే ఏంలో ఆయనకు తగిలు తుంది కాని నాక్కాదు సుమండీ ...."

"ఏమిటి .... ?"

"నిజం చెప్పమంటారా ?"

"అబద్ధాలు తెలపాలా ?"

"మీరలా కోపంగా చూస్తుంటే నాకు నోట మాటే పెగిలిరావటంలేదు...."

"మీ రెందుకు మాటరాక అవస్థ పడటం? నేను వెళ్ళాను—మీరు, మీ ఫ్రెండ్ కలిసి ధారాళంగా మాట్లాడుకోవచ్చును ...." అంటూ గీత కదిలింది.

మోహన్ కంగారుపడ్డాడు.

"ప్లీజ్ ... ! చెప్పేది వినిపించుకోండి .... అసలు విషయం తెలుసుకోకపోతే మీరు నన్ను జన్మంతా ఆడిపోసుకుంటూనే ఉంటారు .... ఆ రెండో జడ్జి లేకపోతే మీకు మొదటి బహుమతేమిటి, అఖిల భారత బహుమతే యిప్పించి ఉండేవాడిని !"

గీత గుమ్మం దాటబోతున్నదల్లా ఆగిపోయి మోహన్ కేసి తిరిగింది.

"నామాట నమ్మండి ! ఆ పోటీ జరిపిన సొసైటీ కార్యదర్శి నా స్నేహితుడు .... జడ్జీలుగా ముగ్గురుండాలట. అందుకని ముగ్గురు సంగీత విద్వాంసుల ఇళ్లచుట్టూ తిరిగి వాళ్ల కాళ్లు పట్టుకుని జడ్జీలుగా ఉండటానికి వాళ్లని ఒప్పించాడుట. తీరా పోతే రోజున వాళ్లలో ఇద్దరు అర్జెంటు పనులంటూ దర్జాగా రావటం మానేశారు.... దాంతో వాడు కంగారుగా పరుగులుదీస్తున్న సమయంలో నేను వాడిని వెతుక్కుంటూ అక్కడికి వెళ్లాను. నేను కంటబడటంతోనే వాడు అమాంతం కావలించుకుని కాళ్ళ అడి బొడుతూ— అవి ఆనందాశ్రువు ట—'దేవుడా వచ్చి రక్షించావురా !' అంటూ నన్ను బలవంతంగా వరో జడ్జి పక్కన కూలేసి 'మీరూ ఆయనేవరూ లేక మీ యిద్దరే ఎలాగోలా పని జరిపించాలి' అంటూ ప్రాధేయపడుతున్నాడు. వాడి ముఖం చూస్తే జాలే సింది. జాలేసి నేనేం చెయ్యను ? వాడిని చాటుగా తీసుకెళ్లి 'నాకు సరిగమలు కూడా రావురా !' అని విన్నవించుకున్నాను. వాడు వినిపించుకోలేదు సరి కదా 'వోరు మూసుకు నడు—మార్కు లెయ్యమంటే ఏమిటో ఈ పేప అరుపులు ! నీకేం, నిక్షేపంలా బి. ఏ. చదివావు ... నీకన్నా మంచి జడ్జి ఎవడు దొరుకుతాడు ? సంగీతం రాదంటావా మరీ మంచిది. వచ్చినవాళ్ళ కొసరి కొసరి మార్కులు వేస్తారు. నువ్వయితే కాస్త మార్కులైనా కనబడతాయి ....' అని చివాట్లేసి 'సీట్లో నుంచి కదిలావంటే చూడు !' అంటూ నన్ను సీటు దగ్గరికి లాక్కెళ్ళి కుదేసి కట్టేశాడు.

తర్వాత పోటీ జరిగింది. ఆడపిల్లల్లో మీ రిద్దరేగా వచ్చారు ? నేను వసంతకన్నా మీకే ఎక్కువ మార్కు లిచ్చాను. నేను ఎనభై వేస్తే ఆయన ఇరవై వేశాడు, వేస్తే వేశాడు కాని నన్ను పట్టుకుని 'ఏమయ్యా ! నీకు సరిగమలైనా తెలిసినట్టు లేవే .... ? ఆ అమ్మాయి పాటలో ఒకటా, రెండా తొంభై అపస్వరా లున్నాయి....' అన్నాడు చిరాకు, కోపం మిళితంచేసి. నాకు అంతకన్నా చిరాకేసింది. 'అపస్వరాల సంగతేమో కాని ఆవిడ కంఠస్వరమే నాకు ఇంపుగా వినిపించింది.' అన్నాను. నిజానికి మొదట పాడినావిడ గొంతుక నాకు చెవులు రిక్కించుకున్నా ఒక్క ముక్క కూడా వినపడలేదు సుమండీ. మీదే ధాటిగా వినపడింది.... దాంతో ఆయన 'సరే ! ఏదో ఒకటి కానియ్య

వయ్యా .... ఇప్పుడు నేను చెప్పినట్లు వాళ్ళులు డిద్దు. వసంతకు మొదటి బహుమతి ఇద్దాం... రెండవ బహుమతి రద్దుచేయమందాం. బొత్తిగా స్టాండర్డు లేదు ....' అన్నాడు. ఆ ముసలాయన ధోరణి చూస్తే నాకు కోపం ముంచుకొచ్చింది. జన్మలో మొదటిసారిగా జడ్జి పని చేయుట మేమిటి, ఈయన నా అధికారాన్ని కూడ లాక్కోవాలని ఎత్తు వేయుట మేమిటి ? నేను మొండికేశాను. మొదటి బహుమతి వసంతకిస్తే నా కభ్యంతరంలేదు కాని రెండో బహుమతి రద్దుచేస్తే మాత్రం నేను ఊరుకోను అని ఖచ్చితంగా చెప్పాను. ఆయన నామీద కారాలు, మిరియాలు నూరితే నేను కత్తులు నూరాను. మా కాట్లాట విని నా స్నేహితుడు పరిగెత్తుకుని వచ్చాడు. ఆ ముసలాయన వాడిమీద విరుచుకుపడ్డాడు. 'చాల్చాల్లేవయ్యా ! మంచివాడిని తీసుకొచ్చి కూర్చోబెట్టావు .... ఆ రెండోపిల్ల వరుసా వాడీ లేకుండా పాడితే ఆ పిల్లకు బహుమతివ్వాలంటాడు .... !' అని మండిపడ్డాడు. అయినా నేను మాత్రం బెదిరి పోలేదు. బహుమతి ఇవ్వాల్సిందేనని పట్టుబట్టాను. దాంతో నా స్నేహితుడు 'ఎలా పాడినా సరే సీన్సిటే బహుమతి యివ్వాల్సిందేనండి .... రద్దుచేయటం ఉండదు....' అని సర్ది చెప్పాడు. ఇదీ అసలు విషయం. నేను అసలు జడ్జినికాను. సత్రకాయ

జీవిత భీమా పట్టాదారులకు

అవసరమైన వయోనిర్ధారణను

అందచేశారా?

చిరునామాలో మార్పులను

తెలియచేశారా?

ప్రయోజనం పొందేవారిని

నియోగించారా?

అత్యవసరమైన యీ వివరాలు
లేకపోవడంవల్లనే జీవిత భీమా క్లెయిములు
అనేకం వెంటనే పరిష్కరించుటకు
సాధ్యపడడం లేదు. అన్నీ సరిగా
వున్నాయో లేదో నేడే మీ పట్టాను
పరీక్షించి చూడండి. సరైన కార్యాలయంలో
సక్రమంగా మీ ప్రీమియములను
చెల్లించుట మరచిపోవద్దు.

- గత సంవత్సరం తామే యిచ్చిన చిరునామావద్ద పట్టాదారులు లేకపోవడంవల్ల 8,81? క్లెయిములు పరిష్కరించబడలేదు.
- వయోనిర్ధారణ జరగక పోవడంవల్ల 4,097 క్లెయిములు పరిష్కారం కాకుండా వున్నాయి
- పట్టాపై ప్రయోజనం పొందేవారిని నియమించక పోవుటవల్ల 4,718 చెల్లింపులు ఆలస్యమైనాయి.

ఈ ఆలస్యాలను మీరే నివారించగలరు



లైఫ్ ఇన్సూరెన్స్
కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

# నేడే భీమాచేయించుకోండి

ASP/LIC/AS-18

జడ్జిని కాను.''

గీత కాస్సేపు మౌనంగా నిలబడి గిరుక్కున తిరిగి లోపలి కెళ్ళింది. మోహన్ తల చేత్తో పట్టుకున్నాడు. గీత మరో క్షణంలో మంచినీళ్ళ గ్లాసుతో తిరిగొచ్చింది.

''అసలే దాహంతో వచ్చారు. దానికితోడు ఇంత సేపూ ముసలాయన సోది వెబుతూ కూర్చున్నారు... చాలా అలసిపోయారుకాని కాపీని మంచినీళ్ళు తాగుతారా ?'' అని గీత గ్లాసు అందించింది.

మోహన్ ''థేంక్స్ !'' అంటూ నిమిషంలో గ్లాసు ఖాళీ చేశాడు.

గీత ఒక్కక్షణం మౌనంగా వూరుకుని ''ముసలాయన చాలా కర్కోటకుడిలా ఉన్నాడు సుమండీ !'' అంది.

''కర్కోటకుడని మెల్లిగా అంటారేమిటి ? మార్కులివ్వటానికి ఎలా గిలగిలలాడిపోయాడని ? స్వంత సొమ్మేదో ధారపోస్తున్నట్లు.....! నిజంగా జడ్జీవని చేసి ఉన్నట్లయితే అందరికీ వరసపెట్టి అమాంతం ఉరిశిక్షలు వేసి ఉండేవాడు మహానుభావుడు !''

గీత బుగ్గలు లొత్తలుపడ్డాయి.

''కొందరంతేలెండి. చాలా క్రూరంగా ఉంటారు.''

''ఉంటే ఉన్నాడు. అలాంటాయన్ని పెద్దచేసి పెత్తనం ఇవ్వటమేమిటి ? పీనుగు పెత్తనం ఇస్తే తలంతా తెగ కొరికిందట !''

''మీరుమాత్రం ఏం తీసిపోయారులెండి..... అతన్ని మూడు చెరువుల నీళ్ళు తాగించారుగా ? తగిన శాస్తి చేశారులెండి..... మీరెక్కడ ఉంటున్నారు ?''

''ఇక్కడికి దగ్గరే నా రూం. ఒక్కడినే ఉంటున్నాను.... ఏం తోచదు.... రేడియో ఉంటే నిక్షేపంలా కాలక్షేపం చేయొచ్చు కాని నా దగ్గరలేదు....''

గీత అర్థంకానట్లు చూసింది.

''లేకపోతే మించిపోయిందేముంది ? ఇప్పుడు కొనుక్కోవచ్చుగా ?''

''కొనుక్కుంటే తీరిపోతుంది కాని వినటానికి తీరికేది ?''

''తీరికలేకపోతే రేడియో ఎందుకు ?''

''ఏమీలేదు........! ఇన్నాళ్ళు తీరికలేదుకాని ఇప్పుడు ఖాళీగానే ఉన్నాను..... మళ్ళా బుకింగులు వచ్చేదాకా విశ్రాంతే....... తీరా పండలకు పండలకు పోసి రేడియో కొంటే కొన్న మర్నాటినుండి నేను స్టూడియోల చుట్టూ తిరగాల్సి ఉంటుంది....''

గీత ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసింది.

''మీరు నటిస్తారా ?''

''ఏదో కొంచెం.......''

''మంచివారే ఇంతవరకు ఆ సంగతి చెప్పారు కాదేం ?''

సంభాషణ చెయ్యిజారిపోతున్నందుకు మోహన్ తల గోక్కున్నాడు.

''చెప్తే ఏం చేసేవారు ?'' అన్నాడు చిన్నబోగా.

''ఏం చేయను. భయపడిపోకండి.....మీరు నాకు స్టూడియోలు చూపిస్తారా......?''

''అలాగే......! ఈ సారి నేను స్టూడియోకు వెళ్ళినప్పుడు మిమ్మల్ని తప్పకుండా తీసుకెళ్తాను.., అంతవరకు రూంలో బోరెత్తిపోకుండా మీ రేడియో ఒక మారిస్తారూ ?'' తెగించి అడిగేశాడు మోహన్.

''మా ఇంట్లో రేడియో ఎక్కడుంది ?''

# అయిదు రెళ్ళు

''ఇందాక పాట వినిపిస్తే మీ రేడియో ఏమో అనుకున్నాను. మీరేనేమిటి ?''

''అది సుధాకర్‌గారిది...... మాదికాదు...ఆయన కళ్యాంతరం లేకపోతే మీరు నిక్షేపంలా తీసుకెళ్ళచ్చు''

మోహన్ సంభాషణ ఒకదారిని పడినందుకు ఉత్సాహంతో ఉప్పొంగిపోయాడు. ''వాడు ఎప్పుడో పర్మిషనిచ్చాను. మీకేం ఇబ్బంది లేకపోతే....''

''ఆయన నాతో చెప్పలేదు..... తీరా ఎందుకిచ్చావని నన్నడిగితే.......?''

''అదా మీ సందేహం ?'' అంటూ మోహన్ బైటకొచ్చి సుధాకర్‌ను లాక్కొచ్చాడు.

సుధాకర్ ''మీ ఇష్టం మీరేం చేసుకున్నారే—'' అన్నాను ఈ గొడవతో తనకేం సంబంధం లేనట్లు అంత భారాన్ని శీతమీద వదిలేసి.

గీత. ట్రాన్సిస్టర్ తెచ్చిస్తానంటూ లోపలి కెళ్ళింది...... మోహన్ కిటికీ దగ్గరకెళ్ళి చువ్వలు పట్టుకుని బైటికి చూస్తూ నిలబడ్డాడు......

''అదేమిటిరా ? ఎక్కడికి ?''

సుధాకర్ మాటలు వినిపించుకోకుండా గేటు తలుపులు తీసుకుని వస్తున్న రామయ్యగారిని దూసుకుంటూ వెళ్ళిపోయాడు మోహన్. రామయ్యగారు కాస్తలో పడేవారే ? గీత రేడియో తీసుకొచ్చి ''ఆయనేరి ?'' అనడిగింది వీధిలో నించున్న సుధాకర్ దగ్గరకొస్తూ.

రామయ్యగారు ''ఆ అబ్బాయెవరు ?'' అడిగారు.

''నా ఫ్రెండ్......!'' అని నీరసంగా జవాబిచ్చాడు సుధాకర్.

''మీ ఫ్రెండేమైనా రన్నింగు రేసుకు ప్రాక్టీస్ చేస్తున్నాడా ?''

''నిజమే సుమండీ......! నాకు ఇంతసేపూ తట్టలేదు..... వాడికి ఆటలంటే చాలా ఇష్టం. ఒకవేళ పోటీకి కట్టాడేమో....?'' అన్నాడు సుధాకర్ సాలోచనగా చూస్తూ.

రామయ్యగారు లోపలికెళ్ళారు.

గీతకూడా లోపలికెళ్ళబోతుంటే ''ఆ రేడియో ఇటివ్వండి అంటూ చెయ్యి సాచాడు సుధాకర్.

గీత నవ్వింది.

''ఆయనతో మీరేం పోటీ చేయగలరులెండి ? పోటచేసినా నెగ్గుతారనే నమ్మకం నాకులేదు... ఎంచక్కా రేడియోలా రయ్యమని ఎలా దూసుకుపోయారో !''

సుధాకర్ దిగులుగా చూశాడు.

''వాడి రూంలో పడేసి వస్తాను......''

''రూంలో పడేసి రావటమెందుకు బలవంతంగా. అంతగా కావాలంటే ఆయనే వచ్చి తీసుకెళ్తారులెండి..........!''

గీత రేడియోతోసహా లోపలికెళ్ళింది.

(సశేషం)




'ఈ పచ్చడి చేసేవిధానం మొన్న పత్రికలో రాస్తే...ఎంతో బావుందని లెక్కలేనన్ని వుత్తరాలు వచ్చాయి! తెలుసా?'

కేవలం విక్స్ వేపోరబ్ మాత్రమే జలుబు బాధిత ప్రాంతాలు మూడింటి మీద వెంటనే పనిచేస్తుంది ...

# రాత్రికిరాత్రే జలుబును తొలగిస్తుంది




విక్స్ వేపోరబ్ తక్షణమే మీకు ఉపశమనాన్ని కలిగిస్తుంది. సులభంగా శ్వాస పీల్చుకొనుటకు...రాత్రంతా హాయిగా నిద్రపోవుటకు మీకు సహాయపడుతుంది...

గొంతునొప్పి, ముక్కునుండి నీరు కారుట, ఛాతీ బిగలాగుట, శ్రమతో శ్వాసపీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనపడగానే జలుబు బాధిత ప్రాంతాల మూడింటి మీద...ముక్కు, గొంతూ, ఛాతీల మీద విక్స్ వేపోరబ్‌ను పులమండి. కొద్ది నిముషాలలోనే విక్స్ వేపోరబ్ మీ చర్మాన్ని వెచ్చచేయడం...మీకు ఉపశమనాన్ని కలిగించడం మీరు గమనిస్తారు. నివారణకలిగించే వేపోరబ్ ఆవిరితెరలు ముక్కు మరియు ఛాతీలలోని కఫాన్ని త్వరగా విదలగొట్టి మీ గొంతునొప్పిని తగ్గిస్తాయి.

విక్స్ వేపోరబ్ జలుబుతో రెండు విధాలుగా పోరాడుతుంది. రాత్రంతా మీరు సుఖంగా నిద్రించే సమయంలో యీ అద్భుతమైన ద్వివిధ చర్య కొనసాగుతూ ఉంటుంది. ఉదయానికల్లా మీ అతి పెద్ద జలుబు కూడా పూర్తిగా పోయి మీరు సంతోషంగాను, ఆరోగ్యంగాను వుంటారు.




## విక్స్ వేపోరబ్ యొక్క అద్భుతమైన ద్వివిధ చర్య



వెలుపలి చర్య: చర్మమును వేడిపరచే వేపోరబ్ యొక్క చర్య మీకు తక్షణమే ఉపశమనమును గలిగించును. వేపోరబ్ యొక్క గుణకరమైన ఔషధములు చర్మము మీద పనిచేసి బిగలాగిన ఛాతీ మరియు వీపును సడలించును. కండరముల నొప్పిని తొలగించును.



లోపలి చర్య: మీ శరీరపు వేడే వేపోరబ్‌ను త్వరగా ఔషధపు ఆవిరి తెరలుగా మార్చును. ఈ ఆవిరి తెరలను ప్రతి శ్వాసతో రాత్రి పొడవునా మీరు లోపలికి పీలుస్తారు. యీ లోపలి చర్య ముక్కులోనూ ఛాతీలోనూ వున్న కఫమును తొలగించును...గొంతునొప్పిని ఉపశమింప జేయును.

తీవ్రమైన జలుబులకు, ఆవిరినుండి లేచి వచ్చే విక్స్ వేపోరబ్ ఔషధపు ఆవిరి తెరలను పీల్చండి.

# విక్స్ వేపోరబ్




3 సైజులలో

వహించాలనే ప్రమేయం లేదు. డబ్బిచ్చి ప్రేమను పిల్లల కోసం కొనుక్కున్నారు. ఆ డబ్బుకు ఆ దాదులు వారి ప్రేమను అమ్ముకున్నారు. ఒకరు ప్రేమనుకొన్నారు. ఒకరు ప్రేమను అమ్ముకున్నారు. మీ పిల్లలు కొన్న ప్రేమతో పెరుగుతున్నారు. ఈ రెండు ముఖ్యమైన పనులనూ మీరెప్పుడయితే విడిచి పెట్టారో, అప్పుడే మీ మనస్సుకి స్వేచ్ఛ, దానంతట అదే కలిగింది. మీ మనస్సు స్వేచ్ఛను ఎప్పుడయితే కాంక్షించిందో అప్పుడే మీకు అనేక రకమైన ఆలోచనలు, వ్యాపకాలూ కలిగినయ్యి. అలాంటి వ్యాపకాలను నాలుగు పక్కలా, వదిలేసినరికి కొన్ని క్లబ్బులవైపు మరి కొన్ని మహిళా మండలి వైపూ, కొన్ని మాటల వైపూ, మరికొన్ని అలంకరణలవైపూ, దారి తీసినయి. అంతటితో మీరూ తదనుగుణ్యంగానే నడుచుకోవాల్సొచ్చింది. సామాన్య సంసార స్త్రీలకి ఇలాంటి వ్యాపకాలన్నీ ఎట్లా కలుగుతయ్యి చెప్పండి. వారి వ్యాపకాలు నిత్యమూ కూడు గుడ్డల కోసమే పాకులాడుతయ్యి. దానికి ప్రధాన కారణం డబ్బు. ఆడబ్బు తన భర్తలు కష్టపడితేనే వచ్చేది. నౌకిరీ చేసి నాలుగు డబ్బులు తెచ్చే భర్తను ఆదరణగా చూడకపోతే ఆ భర్త గతేం కావాలి. ఆయన్నే నమ్ముకుని ఆయన బాగోగులే విచారించకపోతే ఇంక ఆ సంసారం సాగే విధానం. అందుకే ఆవిడ తల్లో పూలు పెట్టుకున్నా, తెల్లచీర కట్టుకున్నా, పౌడర్లు స్నో రాచుకున్నా ఆ వ్యక్తి కోసమే పాటు పడుతుంది. అదే ఆవిడ ధ్యేయం. తన భావాలనూ, తన కోరికలనూ, తన వ్యక్తిత్వాన్ని భర్తకు అనుగుణంగా మలచుకొని భర్త సంతోషమే తన సంతోషంగా భావించి ఆ సంసారాన్ని తీర్చి దిద్దుకుంటుంది. అందులో తప్పేముంది చెప్పండి " అన్నాను.

ఆవిడ ముఖంలో కోపం బాగా కనిపించింది. తన అభిప్రాయాలతో నేను ఏకీభవించక పోయినందుకు కొంచెం చిరాకు పడ్డది.

" వదినా ! ఎవరి భావాలు, ఆదర్శాలు వాళ్ళవి. ఎవ్వరూ వద్దు. పాటక ప్రజలనే తీసుకో. వాళ్ళు మటుకూ స్వేచ్ఛగా, ఆనందంగా, సుఖ సౌఖ్యాలతో తులతూగుతూ ఉండాలని కోరుకోరా ? నిద్ర లేవంగానే గంప నెత్తిన పెట్టుకుని కూలికి పోవటం ఎందుకు ? వాళ్ళు మాత్రం క్లబ్బులకు పోకూడదూ. 'పిక్ నిక్ 'లకూ, పార్టీలకూ పోకూడదూ. అజంతా ఎల్లోరాలను చూస్తూ, కాశ్మీరు లోయల్లో విహరిస్తూ, వెన్నెలలో తాజ్ మహల్ సౌందర్యాన్ని వెయ్యి కళ్ళతో చూస్తూ, బృందావనోద్యాన వనాల్లో విహరిస్తూ, కన్యా కుమారి అగ్రం తీరంలో సూర్య భగవానుని ఉదయాస్తమయాల అరుణరాగ రంజితాలను తిలకిస్తూ ఎందుకు కాలం గడప కూడదూ ? ఎవరయినా వాళ్ళని వద్దన్నారా ? ఎవ్వరూ వద్దనరు. ఏదయినా, ఆదర్శాలు గాని, అంతర్యాలు కాని, స్వేచ్ఛా జీవితం గడపాలని అనుకోవటం గాని అంతా జరుగుబాటును బట్టి ఉంటుంది. జరుగు

# హృదయ కుసుమాలు

27 వ పేజీ తరువాయి

బాటుకు మరొక పేరే డబ్బు. ఆ డబ్బు ఎంత ఎక్కువగా ఉంటే ఆదర్శాలను అంత రమణీయంగా సృష్టించుకోవచ్చు. ప్రేమను కొనుక్కోవచ్చు. ప్రేమించిన వార్ని చులకనగా చూడొచ్చు. చులకన కూడా డబ్బుని బట్టే కలిగేదే. వ్యక్తిత్వాన్ని కూడా డబ్బుని బట్టే ఏర్పాటు చేసుకుంటూ మార్చుకోవచ్చు. ఇదంతా సామాన్య సంసారులకి ఎట్లా కుదుర్తుంది. వదినా ? అందులో జానకి విషయంలో అసలే కుదరదు. ఆవిడ అట్లా ఉండటంలో తప్పేమీలేదు. అంతకన్నా ఆవిడ చెయ్యగలిగిందేమీ లేదు. అనవసరంగా జానకిని నిందించకు " అన్నది రమాదేవి. కృష్ణవేణికి కోపం వచ్చినట్లుంది. మాట్లాడకుండానే వెళ్లి పోయింది. రమాదేవి నావైపు చూసి నవ్వింది. వదినా మరదళ్ల భావాలు, ఒక ఇంట్లో ఉంటున్నా, అంత డబ్బున్నా

వేరేత తూర్పు పడమరలుగా ఉన్నయ్యా అలోచిస్తుంటే నా మనస్సుకు ఎంతో తృప్తి కలిగింది. సంతోషం కలిగింది. ఆనందం కలిగింది. రమాదేవి కళ్లల్లోకి చూసి సంతోషం పట్టలేక నమస్కరించి రెండు చేతులూ పట్టుకుని నా కళ్ళ కద్దుకున్నాను. రమాదేవి అరి చేతులు నా ఆనంద బాష్పాలతో క్షాళిత మయినయ్యి. నా మనస్సులో బరువు తీరింది. ఏదో పెద్ద సమస్య తీరినట్లనిపించింది. కాసేపు కూచుని మాట్లాడి వెళ్లిపోయాను. నే వెళుతుంటే కళ్ళు తుడ్చుకుంది రమాదేవి. ఇద్దరి అంతర్యాలూ పెనవేసుకున్నయ్యి. ఇద్దరి ఆవేశాలూ మిళితమైనయ్యి. ఇద్దరి భావాలూ సెలయేరులా గల గలమంటూ ప్రవహించి చిన్న నదిలా ఏ చప్పుడూ లేకుండా ప్రశాంతంగా ప్రవహించినట్లయింది. నా జీవితానికి ఇదొక ఆశించని ఆశారేఖ. అనుకోని మధురాతి మధురమైన సన్నివేశం. ఏమిటో ఈ జీవితంలో ఇంకెన్ని మధుర క్షణాలను చవి చూడాలో ! " అనుకున్నాను ఆ రోజున.

(సశేషం)





నక్షత్ర ఫలితములు

# పంజాబ్ నేషనల్ బ్యాంక్‌తో మీ భాగ్యోన్నతి సూచిస్తున్నవి

మీరు నక్షత్రఫలితాలు గమనిస్తారా? పగటికలలు కంటారా? మీ కలలు నిజమయ్యేట్లు చేయుటకు పిఎన్‌బి కి అవకాశం ఇవ్వండి. పిఎన్‌బియందు మీరు క్రమంగా డబ్బు నిల్వచేస్తే, మీ కలల్లోవలెనే మీ డబ్బు అద్భుతంగా పెరిగి, మీ భవిష్యత్తు భాగ్యవంతం కాగలదు. మన దేశంమంతా విస్తరించి యున్న పిఎన్‌బి బ్రాంచీలు 441 లో యెచ్చటికైనా వెళ్ళండి. అచ్చటి సిబ్బంది మీకు సంతోషంతో సహాయపడెదరు.

*70 వ వార్షికోత్సవం యెదురుచూస్తుంది!*

## ది పంజాబ్ నేషనల్ బ్యాంక్ లిమిటెడ్

*నేటి ఇండియా బ్యాంకింగు వ్యవస్థలో పెద్దరికం వహిస్తున్న పేరు*

SWT-PNB-3124-A

# అందని పూలు

12 వ పేజీ తరువాయి

మనోస్థైర్యం, ఆత్మవిశ్వాసంలేని వాళ్లకి, మాకు కాదు' అన్నట్టు గుర్తు.

కన్న కలలు నిజమయ్యాయి. కోరుకున్నవన్నీ లభ్యమయ్యాయి. లోటన్నది లేదు. ఇద్దరం ఒక నెల పాటు సౌత్ అంతా తిరిగాం.

ఆహా, నా వివాహ జీవితంలో ఆనందంగా, శాంతిగా, నిశ్చింతగా గడిపిన రోజులు ఏమయినా ఉన్నాయంటే అవి ఆ నెలరోజులే ! అవి జన్మలో ఇంక తిరిగి రావంటే ఎంత బాధ !

ఆ తర్వాత పెద్ద ఇల్లొకటి అద్దెకి తీసుకొని ఇద్దరి పేర్లతో డిస్పెన్సరీ ఓపెన్ చేసి ఆడవాళ్లకి, మగవాళ్లకి వేరే సదుపాయాలు చూశాం. డబ్బుకి ఎవర్నీ నిర్బంధించక పోవడం పేదల దగ్గర ఏం పుచ్చుకోక పోవడం, మిగతావాళ్లు ఆశ వదులుకున్న కేసులు ఒకటి రెండు మా చేతుల్లో విజయవంతం కావడం, ఏ కారణంచేత నంటేనేం, ఏడాది తిరిగేసరికి ఊపిరి సలపనంత పని. పనంటే పట్టలేని ఉత్సాహంగా ఉండేది. నేననుకొన్నది సాధించానన్న తృప్తి, ఉత్తేజం, గర్వం— ఆ ఆవేశంలో కొద్దిపాటి వ్యక్తిగతమైన ఇబ్బందులొచ్చినా లెక్కచేసే వాళ్లంగాదు.

ఒకసారి వూర్లో ఒక పెద్ద మనిషికి చాలా తీవ్రంగా ముంచుకొచ్చింది. ఈయన రాత్రులు, పగళ్లు శాయశక్తులా కృషిచేసి నయం చేశారు. అందుకు కృతజ్ఞతగా కొద్ది రోజులకి ఆయన టౌను హాల్లో చిన్న విందు ఏర్పాటు చేసి, ఆ సందర్భంలో మమ్మల్ని మా ఆదర్శ దాంపత్యాన్ని పొగుడుతూ ఏమేమిటో అన్నాడు. ఆ తర్వాత ఈయన లేచి తమ తరఫునా, నా తరఫునా అందరి యెదుటా ప్రమాణం చేశారు— ఎట్టి పరిస్థితుల్లో నయినా మా ఇబ్బందు లెలాంటివైనా ఆదర్శాలని వదలుకోకుండా వృత్తి ధర్మాన్ని పాటించగలమని ! కొత్త వేడి ! మా ఆదర్శాలు మమ్మల్నెంత బలంగా బంధించాయో తెలియజెయ్యడానికి ఇదంతా వ్రాస్తున్నది.

ఉదయం ఎనిమిది గంటలకి వెళ్లిన వాళ్లం. తిరిగి వచ్చేసరికి ఒంటిగంట, రెండయ్యేది. మళ్లీ నాలుగింటికి వెళ్లడం, ఎనిమిది, తొమ్మిదింటికి తిరిగి రావడం. ఒకోసారి ఇద్దరూ కలిసి రావడానికి వీలుండేది కాదు. ఇంటికి వచ్చాక కూడా మళ్లా ఏవో పిలుపులు ! ఈ పని ఒత్తిడిలో మా వ్యక్తిగతమైన ఆనందం ఎంతగా దెబ్బతిందో నేనే వేరే వ్రాయక్కర్లేకుండానే నీ కర్థమవుతుంది.

వెన్నెల రాత్రులు, రేడియో కూనిరాగాలు, డాబా మీద విహారాలు, మల్లెపూల వాసనలు, ప్రణయ కలహాలు, ఒకరి చెవుల్లో ఒకరు స్వీట్ నథింగ్స్ మర్మరించడం, పడవ షికార్లు— ఇవన్నీ కలల్లో చూసి ఆనందించాల్సినవిగా మిగిలిపోయాయి. ఇంక సినిమాలు, క్లబ్బుకి వెళ్లడం లాంటివి అసలు యోగం అని వేరే రాయాలా ?

ఒకసారి ఏం జరిగిందనుకున్నావు ! బ్రహ్మాండమైన ఇంగ్లీషు సినిమా అంటే ఎంతో కష్టం మీద వీలు కుదుర్చుకొని బయలుదేరాం. తీరా అంతా సిద్ధమయి కారు దగ్గిరకి వచ్చేసరికి, 'సిరి

యూస్ డెలివరీ కేస్' అంటూ యెవరో తయారూ. అప్పుడు నా పరిస్థితి యెలా ఉంటుందో వూహించు. పట్టరాని కోపం వచ్చింది. నాకు తీరుబడిలేదు, ఎవరైనా తీసుకెళ్ళమనాలనుకున్నాను. 'వీళ్ళు, డబ్బివ్వక లేరు, మిగతా డాక్టర్లకి విజిటింగ్ ఫీజుతో పాటు, కారు పెట్రోలు ఛార్జి, తేరా గుర్రం గడ్డి ఛార్జి కూడా ఇచ్చుకోవాలి! ఇలాంటివే యేవో లక్షా తొంభై కారణాలు! రాతేసి కొంచెం

# అందని పూలు

గట్టిగా చెబుతారేమోనని వారివంక ఆశగా చూశాను. ఆయన నవ్వు నొప్పుకున్నట్టు చూడసాగారు. ఇద్దరం అలా ఒకర్నొకరు కాసేపు చూసుకున్నాక, చివరికి ఆదర్శాలని ఒదులుకునే వాపలేక 'వెళ్ళు లీలా, ఏం చేస్తాం! మనిషి ప్రాణంకంటె యెక్కువా, మనసర్దా!' అన్నారాయన.

ఇంకోసారి ఇల్లాగే. ఒక స్నేహితుని ఇంట్లో పాపాయి పుట్టిన రోజుకి పెద్ద ఎత్తున 'ఎట్‌హోమ్' ఇచ్చారు. పార్టీలకి, షికార్లకి మోహం వాచిన నేను ఎంతో సర్దుపడి ఉన్న పని అంతా అయిందనిపించి గంటలకే తెముల్చుకొని ఇంటికి వచ్చానో లేదో నా వెనకాలే కబురు! ఆ రోజు ఉదయం ఎడ్మిట్టయిన బ్లీడింగ్ కేస్‌కి ఏదో సీరియస్ కాంప్లికేషన్. ఏం చెయ్యడం? 'ఇద్దరం వెళ్ళకపోతే వాళ్ళు బాధ పడతారు, నువ్వు వెళ్ళు' అంటూ ఒంటరిగా వెళ్ళడం నా కిష్టంలేదని తెలిసీ బలవంతం చేశారు. తీరా అక్కడికి వెళ్తే, కిలకిలా నవ్వులతో కలకల్లాడే జంటల మధ్య నేను ఒక్కదాన్నే తోడులేని దాన్ని అనిపించి చిన్నబోయాను. 'ఏరి, మీ వారు రాలేదేం? మీ రొక్కరే వచ్చారేం? ఏమిటండీ! ఇంత చదువూ చదివి, ఏ సోషల్ ఫంక్షన్స్‌కీ రారు? క్లబ్బులోనూ కనపడరు! అస్తమానం ఇంట్లోనే యేమీ ఉంటారండీ?'— లక్షా తొంభై ప్రశ్నలు. ఏం జవాబివ్వగలను! ఒకోసారి విసుగుతో, నన్ను చిన్న బుచ్చడానికే అలా అడుగుతారేమో అని కోపం వస్తుంది. ముళ్ళ మీద కూచున్నట్టు కాసేపు కూర్చొని అందరికన్నా ముందు వచ్చేశాను.

ఎన్నని చెప్పను! ప్రతి రోజు ఏదో ఒకటి ఎదురయ్యేది. రోజులు గడుస్తున్న కొద్దీ నాలో విసుగు యెక్కువయింది. పని మీద శ్రద్ధ తగ్గింది. గానుగెద్దు జీవితంలా రోజూ ఆస్పత్రి, రోగులు, రోగాలు, మందులు! ఆ వాతావరణంలోకి వెళ్ళడమంటేనే నరకంలోకి త్రోస్తున్నట్లుండేది. ఒక సర్దా లేదు, సంతోషం అంతకన్నా లేదు. నవ్వుకుంటూ, ఒకర్నొకరు, తృప్తిగా ఆశలు ఫలించిన ఆనందంలో చూసుకుంటూ, కావాలని తాకి సంతోషించే యువజంటల్ని చూసినప్పుడు చెప్పలేని ఈర్ష్య, అసూయ! పెళ్ళయిన మూడేళ్ళలోనే నా ముచ్చటలు ఇలా తయారయాయి!

మొదట్లో ఆయనెంతో ప్రోత్సాహపరుస్తుండేవారు! ఒక పూట యెప్పుడైనా నేను బద్ధకిస్తే తనే నా పాత ఉత్తరాల్లో మాటలు గుర్తు చేసి మంచిగా కబుర్లు చెప్పి కూడా తీసుకెళ్ళేవారు. పని మీద నాకన్నా ఆయనకే శ్రద్ధ యెక్కువన్న మాట నిజం.

బాబు కడుపున ఉండగా చివరి నెలలో ఒక రోజు చాలా నీరసంగా ఉండి, ఆ రోజు ఆస్పత్రికి వెళ్ళలేననిపించి పడుకుండి పోయాను. ఆయన వెళ్తూ నేనింకా అలాగే ఉండడం చూసి 'రావేమిటి?' అనడిగారు. నా పరిస్థితి చెప్పాను. ఏమన్నారో తెలుసా? 'అందుకే ఆడవాళ్ళకి చదువు, ఉద్యోగాలు వద్దు, దేవుడిచ్చిన పెళ్ళి, వంటగది చాలన్నారు మనవాళ్ళు!' అంటూ నవ్వి వెళ్ళిపోయారు. దగ్గరకి వచ్చి కాస్త చల్లగా మాట్లాడక పోతే పోయె, 'పోనీలే, విశ్రాంతి తీసుకో!' అంటే ఎంత బాగుండేది? పైగా ఆడవాళ్ళందరి గురించీ ఆ మాటెందుకు? నా మనస్సెంత నొచ్చుకుందో తెలుసా? ఇంక ఎప్పుడూ ఏమయినా పనివాళ్ళకి చెప్పుకోలేదు.

అందుకే బాబు పుట్టాక, ఆ పదిహేను ఇరవై రోజులే ఇంటిలో ఉన్నది. పోనీ అప్పుడైనా, ''ఇప్పట్నుంచీ యెందుకు, ఇంక కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకో'' అంటారని ఆశించిన నాకు ఆశాభంగం









మీ కృషియే దేశానికి సౌభాగ్యం
మీ పొదుపే రక్షణనిధికి మదుపు




# అధిక కాంతిగా ఉతుకుతుంది!

కొత్త విధంగా తయారైన సన్‌లైట్‌కు సరికొత్త కాగితపు మూత; సుందరమైన కొత్త ఆకారంగలదు.
అంతేగాక... దాని 'అధిక కాంతినిచ్చే శక్తి' ఉతుకుతున్నప్పుడు మీ బట్టలను అతి కాంతిగా చేస్తుంది...!

అధిక తెల్లగాను, అధిక కాంతిగాను ఉతుకుతుంది

హిందూస్తాన్ లీవర్ ఉత్పత్తి

S. 53-140 TL

# భారీయెత్తున దేశరక్షణకు
# ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

వాడివే కాకుండా ఇంకా క్రొత్త ఇబ్బందులు ఎదురయ్యాయి. పిల్లవాడిని కనిపెట్టుకుండడానికి ఒక ఆయాని కుదిర్చాను. ఆయాని పెట్టడం ఆయన కిష్టంలేదు. అప్పుడప్పుడు కొంచెం హేళనగా అంటూండేవారు— ఈ రోజుల్లో తల్లుల బాధ్యత కనడంతోనే తీరిపోతుందని! అటు వాడిని చూసుకుంటూ, ఇటు పనీ వదలకుండా ఉండడం ఎలా సాధ్యపడుతుందన్న విషయం ఆయన కెలా తట్టలేదో అర్థం కాదు. ఆ రోజు లెలా గడిచాయో ఇప్పుడు తల్చుకుంటే ఆశ్చర్యమేస్తుంది. ఎట్టి పరిస్థితుల్లోనైనా నా పని మానకూడదన్న పంతం నేను వదల లేదు. ఆయనకి పని మానిపించగల ధైర్యం లేనప్పుడు నా వోటమినెందు కంగీకరించాలి? పెళ్ళిముందు, పెళ్ళయాక అందరి ముందూ అన్ని పెద్ద పెద్ద మాటలు వల్లించిన వారికి ఇంత త్వరలో 'భార్యచేత పని మానిపించి ఇంట్లో కూర్చోబెట్టారని' అందరూ ఏదో మాట అంటారని ఒకమాదిరి భయం! కాని అలా కాకుండా ఇంట్లో జరిగే తీరుని చూసినప్పుడు ఆయనలో చికాకు, విసుగుదల రకరకాల రూపాల్లో వ్యక్తమయ్యేది. ఒక్కోసారి నేనూ వోర్పుని కోల్పోతే చిన్న చిన్న చిటపటల్తో మొదలై ఒకోసారి గాలివానగా మారడం మామూలు!

ఇంట్లో ఉండి అన్నీ చూసుకుంటూ చెప్పినే పని వాళ్ళు సరిగా చెయ్యరుగదా! అలాంటిది ఇద్దరం, రోజులో పదిగంటలు బయట తిరుగుతూంటే ఆయా పసివాళ్ళని సరిగ్గా చూడక పోవడం, వంటవాడు వంట తగల బెట్టడం, జరగక ఏమవుతాయి! నాక్కూడా ఈ పరిస్థితి అంటే రోతగా ఉండేది. ఒకసారి ఆస్పత్రి నుంచి కొంచెం తొందరగా ఇంటికి వచ్చేసరికి, 'ఛీ, దిక్కుమాలిన పిల్లలు! ఒక్క నిమిషమైనా ఎరుకోనీయరు!' అన్న ఆయా మాటలు వినబడ్డాయి. ఊరందరి పిల్లల క్షేమాలకి కృషి చేస్తున్నాననుకొనే నేను నా పిల్లల్ని ఆయా చేతిలో పెట్టి, వాళ్ళని దిక్కులేని వాళ్ళని చేశాను! ఆ తర్వాత ఆయాని ఏమని మాత్రం ఏం లాభం! నాలో అది రగిలించిన మంట అలా రగుల్తూనే ఉంది ఇప్పటిదాకా?

ఒకసారి మేం ఇద్దరం అప్పుడే ఇంటికి వచ్చి టీ తాగుతున్నాం. బయట బాబు ఎవర్నో తిట్టుతున్నాడు— ఇంటా వంటా ఎరుగని బూతులు!

'వెల్‌డన్, బాయ్!' అన్నారు నాకేసి నవ్వుతూ చూసి. ఆ వ్యంగ్యంలో 'చూశావా, నీ పెంపకమెలా ఉందో!' అన్న హేళన ధ్వనించింది. వాడిని పట్టుకుని ఉతికాను. నా మీద నాకే కలిగిన కోపాన్ని అక్కణ్ణుంచి అలా తీర్చుకో గలిగాను కాని, ఈ పరిస్థితికి ఎలాగో స్వస్తి చెప్పాలన్న తీవ్రమైన కోరిక ఎప్పటికప్పుడు బలపడుతోంది.

ఇలా కూర్చొని వ్రాస్తూంటే వేలకొద్దీ సంఘటనలు [illegible] ముసురుకొస్తున్నాయి. అన్నీ రాయగలిగే [illegible], మరి క్షణంలో [illegible] శక్తి అందరికీ ఉండదు. అలా [illegible] చేసుకొని బాధ [illegible]!

చివరికి ఈ రోజు ఏమైందో తెలుసా?

సరిగ్గా ఒంటి గంటకి ఎవరో ప్రాణం మీది కొచ్చిందంటే బయటికి వెళ్ళాను. [illegible] గంటకి ఆయన ఇంటికి వచ్చారు. నాయర్ ఆయన కిష్టంలేని కూర చేశాడు. మిగతావి తగలబెట్టాడు. అదేమని అడిగితే 'అమ్మగారు నాకు బాగా చేతనవుంది చెయ్యమన్నారు, ఇది చేశాను' అని జవాబిచ్చాడు. అంతకు ముందు నాకిట్లో పాపాయి మట్టిలోకి పోకి ఆ ఎండలో ఒళ్ళంతా మురికి చేసుకొని దొర్లుతూంటే, ఆయా దూరంగా నిద్రపోతూండడం చూశారు. ఇంక ఆయన కెలా ఉంటుందో వూహించు.

రెండింటికి నేను తిరిగి వచ్చేసరికి ఆయన గబగబా గదిలోకి వెళ్తున్నారు. అన్నం వదిలి వెళ్ళిపోయారన్నాడు నాయర్. ఏం జరిగిందీ నాకు తెలియదు. నేనూ ఆకలి మీద చికాకులో ఉన్నాను.

వెనకాలే గదిలోకి వెళ్ళి నెమ్మదిగా అడిగాను— ఏమయిందని.

"ఏముంది అవడానికి?" అని జవాబు.

"అన్నం వదిలేసి వచ్చేశారేం?"

"అందుకు నీకు సంజాయిషీ ఇచ్చుకోవాలా?"

"ఎందుకంత కోపం! ఏదో పొరబాటు జరిగింది. వాడికి చెప్పకపోవడం నా తప్పు. క్షమించండి. రండి కలిసి కూర్చుందాం." నాలో వోర్పు క్షణ క్షణానికీ తక్కువగా దిగజారుతున్నా సాధ్యమైనంత శాంతంగా అన్నాను.

"తప్పువాది, నన్నిలా ఒదిలెయ్! నిన్ను క్షమించడానికి నేనెవర్ని?" ఆ కంఠంలో తీవ్రత చూసి నేను కొద్దిసేపు మాట్లాడలేదు.

"ఇద్దరం బయటికి పోతున్నప్పుడు ఇలాంటి వేవో జరుగుతుంటాయి సర్దుకోక పోతే ఎలా! రోజూ ఇలా ఏదో ఒకటి జరుగుతూనే ఉంటే ఇంక అయినట్టే!"

"ప్రపంచంలో మిగతా అందరూ ఇంటా బయటా నెగ్గుకోవడం లేదూ! చేతకాక పోతే సరి!"

నా చేతకానితనాన్ని గురించి ఆయన మాట్లాడినప్పుడు భరించగల శాంతం నాకు లేకపోయింది.

"ప్రపంచంలో అందరూ మీలా కాస్తని పది రెట్లు చేసుకొని, ఇల్లు నరకం చెయ్యరు!"

"పిల్లలు ఇద్దరూ దిక్కు మొక్కులేని వాళ్ళలా మట్టి గొట్టుకు పోతూంటే 'కాస్త' బాగుందన్న మాట నీకు! వాళ్ళ వంకెప్పుడన్నా చూశావా? ఇంట్లో అన్నీ ఎలా తగులబడి పోతూన్నాయో నీకేమన్నా పట్టిందా?...."

"పిల్లలు నా ఒక్కర్తికే కాదు, మీకూను. నాకెంత బాధ్యతో మీదీ అంతే. ఇంట్లో విషయాలు మీరు మాత్రం పట్టించుకున్నారా? అసలు మీలాగే నేనూ పని చేస్తున్నదాన్ని మీకు లేని తీరిక నాకెక్కడిదనుకున్నారు? ఎలాంటి పరిస్థితుల్లోనూ, వ్యక్తిగతమైన ఇబ్బందులెలాంటివైనా, వృత్తి ధర్మాన్ని అతిక్రమించ కూడదని మీరేగా నీతి బోధ చేసింది!..." ఆయన మాటల్ని తిరిగి అప్పచెప్పాను.

ఆయన వెంటనే లేచి బట్టలు వేసుకున్నంత సేపూ నాలో ఇన్నేళ్ళ నుంచీ అణిగి ఉన్న మంట అంతా వెళ్ళగక్కాను. ఆయన మొగం ఎర్రబడుతూంటే, కనుబొమ్మలు ఇంకా ఇంకా ముడుచుకు [illegible] తృప్తి కలిగింది.

చివరికాయన, "గో టు హెల్ విత్ యువర్ ప్రొఫెషన్ అండ్ యువర్ ఐడియల్స్!" అని శపించినట్టు అనేసి బయటికి వెళ్ళిపోయారు.

ఈ ఉత్తరం రాసేవేళకి తొమ్మిది కావస్తోంది. ఇప్పటివరకు ఆయన రాలేదు. నా మనసెంత బాధ పడుతోందో నీకు నేను వేరే రాయాలా?

ఏమిటలా పసివాళ్ళలాగ, పరిదిద్దుకో గల

# అందని హాలు

సహృదయత లేకండా, బతుకు బండలు చేసుకుంటున్నారని ఆశ్చర్యపోతున్నావా ? ఏం చెయ్యమంటావు, అశా ? నాకూ పని మానెయ్యాలనుంది. ఇంతదాకా చేసిన మానవసేవ చాలు. చేతకానప్పుడు ఏం చేస్తాం ! కాని ఆయనతో ఆ మాట చెప్పడానికి నాకు మనస్కరించడం లేదు. నా పరిస్థితి అర్థం చేసుకో. దీన్ని అహానే అనుకో. కాని మేం ముందు అనుకొన్న మాటల్ని ఆచరణలో పెట్టలేక పోవడంతో మొదటి అడుగు నాదేనని తేలిపోవడం నా వల్ల గాదు. బహుశా ఆయునది ఇదే పరిస్థితేమో !

ఇదొక పీట ముడి. ఇందులోంచి బయట పడగల మార్గం నువ్వు చూపెట్టగలవనే ఆశతో నీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. మేం ఇద్దరం నీకు కావల్సిన వాళ్లమే కాకుండా, నువ్వు ఇద్దర్నీ బాగా యెరుగుదువు. చెప్పగల దానివి నువ్వు.

ఏదో ఒకటి చెప్పు.

నీ
లీల."

* * *

టేబిల్ మీద చేతుల్ని మడిచి తల ఆన్చి పడుకున్న లీలకి కలలో ఎవరో తల నిమురుతున్నట్టు అనిపించింది. ఆ తర్వాత ఆ స్పర్శ వాస్తవంగా తెచ్చ సాగింది క్రమేపీ. ఉలిక్కిపడి తల యెత్తింది.

టేబిల్ మీద కూర్చొనున్నాడు వేణు. ఆమె తల అతని ఒడిలో ఉంది.

"ఎంత సేపయింది, వచ్చి ?" లేచి నిలబడి అడిగింది.

"ఇప్పటిదాకా ఇలా పడుకున్నావా ? ఏం చేస్తున్నావు ?"

లీల తల దించుకుంది అతని చేతిలో ఆమె రాసిన ఉత్తరం కాగితాలు ఉన్నాయి. అతనది చదివాడని తెలుస్తూనే ఉంది.

"ఇలారా !"

అతన్ని గట్టిగా హత్తుకుని కళ్ళు మూసుకుంది లీల.

"నా పిచ్చి లీలా !" అతని పెదాలు ఆమెనుదుటినీ, చెంపల్ని, చెవుల్ని, జుట్టునీ గట్టిగా అదిమాయి. "నిన్ను చాలా బాధ పెట్టాను, లీ, క్షమించవూ !"

మాట్లాడగల స్థితిలో లేదు లీల. ఆమె చెంపల్ని కన్నీరు ధారలు కట్టాయి.

"నేనే వోడిపోయానని ఒప్పుకుంటున్నాను. రేపట్నుంచీ నీ పని నేనే చూస్తాను, ఇంట్లోనే ఉండు. పని నీకు బాధ్యత కాకూడదు. హాబీగా నీకు తోచినప్పుడు ఏవో ఒకటి రెండు కేసులు చూస్తూండు. సరేనా ?" కాసేపు పోయాక అన్నాడు వేణు, పక్కని జేరుతూ.

* * *

"అన్నట్టు నీ ఆప్త మిత్రురాలికి మనసు విప్పి వ్రాసుకున్న ఉత్తరం ఇలాతే, దారిలో పోస్టు చేస్తాను." మర్నాడు హాస్పిటల్కి వెళ్లేముందు నవ్వుతూ అన్నారు.

"అది చించెయ్యడం, పని మనిషి చెత్తబుట్టకి జేర్చడం కూడా అయిపోయింది, మీకా శ్రమ అక్కర్లేదు లెండి." నవ్వింది లీల.



# మీకు నమ్మకం ఉందా?

సమ్మోహనకరంగా వున్నారు, నిజమే. అందంగా అలంకరించుకున్నారు. చదువులో కూడా మీరు ముందే. కాని మీరు యితరులకు అంగీకారమైన వ్యక్తా?

శరీరంపై దుర్గంధం గొలిపే క్రిములు లేకుండా మీరు చేయలేరు. కాని, క్రమం తప్పకుండా సింథాల్ వాడకంద్వారా వాటిని మీరు తప్పక నిర్మూలించగలరు. మహాద్భుతంగా, క్రిముల సంహార కారిణిగా పేరొందిన జి-11* కలిగివున్న సబ్బు ఇండియాలోకెల్లా ఇది ఒక్కటే కోట్లాది వాడి, పరీక్షించి అంగీకరించిన సత్యం. మీ పేరు చాలావరకు దీనిమీదే ఆధారపడి వుండగలదు.

సువాసనగొలిపే సింథాల్ దుర్గంధం గొలిపే క్రిములను సంహరించి, మీ శరీరచ్ఛాయకు వన్నె తెస్తుంది.

అందం ఇనుమడింపజేసే సబ్బుమాత్రమేగాక క్రిమి సంహారిణికూడా



సింథాల్ సబ్బుతో స్నానంచేసిన అనంతరం అతి కమ్మని వాసనలీనుతూ, క్రిమి సంహారక గుణం కల జి-11 కలిసివున్న సింథాల్ టాయిలెట్ పౌడర్‌ను వంటిమీద చల్లుకుంటే మరింత రక్షణ.




* ఎల్. జివోదా కంపెనీ యొక్క ట్రేడ్ మార్కు.

* "జి-11-ఏమిటి?" అనే ఉచిత సలహా పుస్తకం కోసం గోద్రేజ్, బొంబాయి-12'కు వ్రాయండి.



గోద్రేజ్ సబ్బులలో మేలైన దానిపేరు

CT. 10A. TEL.

# చిత్ర నిర్మాతలుగా మహిళలు

# 'నర్తనశాల'తో విజయభేరి మ్రోగించిన శ్రీమతి రాజ్యం

మంచి చిత్రాన్ని నిర్మించటం ఒక మహత్తరమైన యజ్ఞం చేయటమే,—

నిర్మించిన చిత్రాన్ని ప్రేక్షక పీఠుల్లోనికి పంపి, విజయం సాధించటమన్నది అశ్వమేధ యాగంలోని అశ్వాన్ని దేశాన్నంత త్రిప్పి, జయప్రదంగా మరల్చుక రావటంతో సమానం —

చిత్రం ఆర్థికంగా విజయాన్ని పొందాలని భావించటం, 'గాలిలో దీపంపెట్టి, నీ దయ భగవంతుడా' అన్నంత ప్రమాదకరమైన అంశంకాక పోయినా, మొత్తంమీద, విధితో పరిహాసిలాడటమే

ఇక, ప్రజల అభినందనలకూ, అనంతరం శత దినోత్సవాలకు ఎదురుచూడటంవల్ల ప్రత్యేక మయిన ప్రయోజనంలేదు గాలి వాలునుబట్టి చిత్రాలు శతదినోత్సవాలూ చేసికోవచ్చు, లేదా దినోత్సవాలతోనే పుట్టింటికి వెళ్లిపోవచ్చును

స్థూలంగా చెప్పాలంటే, నేటి చిత్ర నిర్మాణపు రీతి ఇది నిర్మాత కేవలం అవసరానికి ఇన్వెస్ట్మెంటులోకి చేతిని పోనిచ్చే వ్యక్తిమాత్రమే తను పెట్టింగిన డైనా తిరిగి వస్తుందో, రాదో— లేదా,— అసలు ఆ ఇన్వెస్ట్మెంటు అయినా మిగులుతుందో లేదో నిర్మాతకే తెలియదు

తెలుగులోనయితేనేమి, మరో భాషలో నయితే నేమి చెయ్యి తిరిగిన చిత్ర నిర్మాతలున్నారు. తిరిగిన ఆ చేతులతోనే రాష్ట్రపతి పురస్కారం అందుకొన్నవారే, కొన్ని సంవత్సరాలలో, చేతులు ముడుచుక కూర్చొంటున్నారు.

చిత్రలోకంలో 'విధి' అనే అంశం ఇంతటి ప్రముఖమైన పాత్రను నిర్వహిస్తూ, తన ప్రభావాన్ని తన వీక్షణాలను తీక్షణంగా ప్రసరిస్తూ ఉన్నా..... ఈనాడు కొందరు మహిళలే విజయవంతమైన నిర్మాతలుగాను, చిత్రనిర్మాణంలో సహాయకారులుగా ఉండటాన్ని 'వనితాలోకం' తప్పకుండా గర్విస్తుంది

చిత్రాన్నొకదాన్ని నిర్మించాలని అనుకొన్న తొలి క్షణంనుంచే మోయలేనంత భారం నిర్మాతల భుజస్కంధాల మీద పీఠం వేసుకుని కూర్చొంటుంది. సినిమా అన్న తరువాత కథ కావాలి— ఈ కథను మంచిమాటి రత్నాలతో పొదిగే ప్రతిభావంతుడైన దర్శకుడు కావాలి. ఆ తరువాత రచయిత పటిష్టమూ, ఆకర్షణీయమూ అయిన సంభాషణలను చిలికి, కవులు పాటలు వ్రాయాలి. వీటికి మాధుర్యాన్ని చేకూర్చగల సంగీత దర్శకుడు కావాలి ఇంకా ఎందరెందరో సాంకేతిక నిపుణులు ఈ సాంకేతికుల కృషికి, ప్రతిభకూ న్యాయం చేకూర్చి, జనాన్ని మెప్పించగలిగిన నటీనటులను ఎన్నుకోవాలి ప్రతిదీ ఒక సమస్య ! ఈ సమస్యల కంటకాల మధ్య చిక్కుకొన్న ఏ నిర్మాతకయినా, కంటికి రెప్పలా ప్రతి సమస్యనుంచి రక్షించుకొంటూ బయటపడటం తేలికైన పనికాదు. దానికి ఎంతో చాకచక్యమూ, అనుభవమూ, ప్రజల హృదయాల్లో దాగివున్న భావ పరంపరను తరచి తరచి చూడ గల ప్రతిభ కావాలి.

సమస్త అంతే— చిత్రనిర్మాతలుగా మహి



శ్రీమతి లక్ష్మీరాజ్యం

ళలను గురించినంత— ఈ మహిళా నిర్మాతలందరికీ పైన చెప్పుకొన్న ప్రతిభా వ్యుత్పత్తులన్నీ ఉన్నాయా అన్న ప్రశ్నకు వచ్చే సమాధానం (ఏదైనా కానీయండి) వివాదాంశమే అవుతుంది.

ఏమయితేనేం, ప్రతిభా వ్యుత్పత్తులవల్ల అయితేనేమి, స్వయంకృషివల్ల అయితేనేమి వెలుగులోకి వచ్చిన మహిళా నిర్మాతల్లోను, చిత్రనిర్మాణపు పనులలో సహకరించిన వారిలోను, తెలుగు భాషకు సంబంధించినంతవరకు మనకు తప్పకుండా వినిపించే పేర్లలో శ్రీమతి లక్ష్మీరాజ్యం, శ్రీమతి అంజలీదేవి గారలుంటారు.

* * *

శ్రీమతి లక్ష్మీరాజ్యం పేరు వినగానే, ఆధునికులకు నిర్మాత లక్ష్మీరాజ్యం గుర్తుకువచ్చినా, మునుపటితరం పెద్దలకు కథానాయిక లక్ష్మీరాజ్యం కూడా స్మృతిపథంలో మెదలకపోదు.

లక్ష్మీరాజ్యం ఒకప్పటి అగ్రశ్రేణి నటీ, నాయిక. చిన్నతనంనుంచే రంగస్థల నాటకాల్లో పాల్గొంటూ కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుకొన్నది. అనంతరం విచిత్రంగా చిత్రసీమలో ప్రవేశించి, ఇల్లాలు, పంతులమ్మ, ద్రోహి, సంసారం, దాసి, హరిశ్చంద్ర చిత్రాలలో నాయికగా వేనోళ్ల ప్రశంసలందింది.

"మీకసలు సినిమాలు తీయాలనే అభిప్రాయం ఎందుకొచ్చింది ?"

దీని సమాధానం చాలా సహజంగా ఉంది— ఆ రోజుల్లో 'సంసారం' చిత్రంలో బుక్ అయినారట మొదట. కొంతవరకూ నిర్మాణం సాగిన 'సంసారం' చిత్రం ఒక దశలో ఉన్నట్టుండి ఆగిపోయింది. **చిత్రనిర్మాణం కొనసాగటానికి శ్రీమతి లక్ష్మీరాజ్యం,**



'నర్తనశాల'కు రాష్ట్రపతి బహుమతి ప్రదానం.

# సినిమా తీయటం అందరూ అనుకొనేటంత సులభంకాదు:
# సుప్రసిద్ధనటి, నిర్మాత అంజలీదేవి అభిప్రాయం

మరికొందరు మిత్రులతో తోడ్పడవలసిన అవసరం వచ్చిందని వారన్నారు. అన్నీ యథాప్రకారం సాగిపోవటం, 'సంసారం' చిత్రం ప్రతి తెలుగువారి సంసారంలోనూ చోటు సంపాదించుకోవటంతో— 'మనమూ ఒక సినిమా ఎందుకు తీయకూడదు' అనే కుతూహలం లక్ష్మీరాజ్యంగారికి కలిగింది. ఆ భావంయొక్క ఫలితమే ఈనాటి రాజ్యంపిక్చర్సు సంస్థ స్థాపన.

సరిగ్గా, అదే సమయానికి శ్రీమతి లక్ష్మీరాజ్యానికి చిత్రాలలో కథానాయికగా నటించే అవకాశాలు తరిగిపోయాయి. మరో వ్యాపకం అవసరమనీ వారికి తోచింది.

"మరి కథానాయికగా నటించే అవకాశాలు తరిగిపోయినా, మరో వేషం ఎందుకు వెయ్యలేక పోయారు" అన్న ప్రశ్నకు వారి సమాధానం : "మిగతా వేషాలకు 'నేనే' అని ఏముంది. చాలా మంది ఉన్నారుగా !"

ఈ సంస్థ తొలి చిత్రం 'దాసి'. రాజ్యం పిక్చర్సుపేరన ఉన్న ఈసంస్థకు శ్రీధరరావు ప్రధాని. సహాయకులలో ప్రధాని శ్రీమతి రాజ్యం.

తమిళమూ, తెలుగు— ఉభయభాషల్లో నిర్మించబడిన 'దాసి' ప్రజా హృదయాలను బాగా ఆకట్టుకోగలిగింది.

తరువాత 1956లో—'హరిశ్చంద్ర', 1959లో 'కృష్ణలీలలు' తయారయ్యాయి. 1963 లో తయారయిన 'నర్తనశాల' తెలుగు చిత్రలోకానికొక నూతనమైన గౌరవస్థానాన్ని కల్పించి, ప్రతిచోటా సత్కారం పొందింది. అఖిలభారత స్థాయిన ద్వితీయ ఉత్తమ చిత్రంగా ఎంచుకోబడిన తొలితెలుగు చిత్రం ఇదే. 'ఫిలింఫేర్' పత్రిక కూడా దీనిని ఉత్తమ తెలుగు చిత్రంగా సత్కరించింది. ఇలాంటివే మరో రెండు సన్మానాలు పొందిన'నర్తనశాల'జకార్తాలో విజయవీధుల్లోనర్తించి, ఉత్తమ నటుని (ఎస్. వి. రంగారావు) బహుమానం, ఉత్తమ కళాదర్శకుని (శ్రీ టి వి ఎస్ శర్మ) బహుమతులతో తిరిగి వచ్చింది కాళిదాసు వారి శాకుంతలాన్ని చిత్రీకరించటానికి కృషిప్రారంభమైంది

'నర్తనశాల' తో రాజ్యం పిక్చర్సువారి అదృష్టం తెలుగువాట రాజ్యం చేసిందన్న వాస్తవం నిర్వివాదం బహుశా, ఇదే చిత్రంతోనే ఈ 'సంస్థ', చిత్రపరిశ్రమలో మరికొంత లోతుగా ప్రవేశించాలను అనుకొన్నది

ఉత్తమ చిత్రాల నిర్మాణానికి, ఉత్తమ సంప్రదాయాలను నెలకొల్పటానికి, ఇలాంటి సంస్థలే తోడ్పడాలి. కొత్తగా వచ్చిన సంస్థలు ఆ సాహసాన్ని చేయవు

ఆర్థిక విజయంతో నిమిత్తంలేకుండా ఒక 'క్లాస్ చిత్రాన్ని', ముఖ్యంగా సాంఘికాన్ని, ఎందుకు నిర్మించరాదన్న మా విలేఖరి ప్రశ్నకు— "తప్పకుండా 'ట్రై' చేస్తామండీ" అంటారు శ్రీమతి రాజ్యం. మరి ఎప్పుడో ?

పైగా "పిక్చరు విడుదలయి ఎలా పోతున్నదో తెలిసేవరకు గుండెల్లో రైళ్లు పరుగెడుతూనే ఉంటాయి—" శ్రీమతి రాజ్యం ఉవాచ

ఇంతటా పేరు ప్రతిష్ఠలూ, ప్రేక్షకుల అభిమానమూ ఆర్జించుకొన్న శ్రీమతి రాజ్యం ఇకముందైనా వాస్తవాన్ని సూచించే సత్యజిత్‌రాయ్ చిత్రంలాంటి, ఒక చక్కని కళాఖండాన్ని—ఆర్థిక విజయంతో నిమిత్తంలేకుండా— నిర్మించినప్పుడు



"నిర్మాతగాకంటె, నటిగానే జీవితం హాయిగా వుంటుంది" - అంజలీదేవి.

రాజ్యం పిక్చర్సు పేరు తెలుగువాట మరుపురానిదిగా మారుతుంది.

* * *

"సినిమా తీయటం మాటలా ? బోలెడంత శ్రమా, కృషీ కావాలి ! ఒకటుంటే మరొకటి ఉండదు సమయానికి ఒక నటుడొస్తే, మరొకరు రారు సినిమా నిర్మాణం మొదలెట్టినప్పటినుంచి, అది ముగిసేవరకూ కొంటె గుర్రంమీద సవారీ చేసినట్లుంటుంది ఆ గుర్రం బుద్ధి ఎలా ఉంటే, మన అదృష్టం అలా ఉంటుంది"

ఇవి నా మాటలు కావు. గత 13 సంవత్సరాలుగా చిత్రనిర్మాణంలో ఢక్కామొక్కీలు తిన్న శ్రీమతి అంజలీదేవి సినిమా తీయటం గురించి చెప్పిన మాటలివి

ఈ మాటలైనా ఎవరో చెప్పినవి, ఎక్కడో విన్నవీ కావు అంతా వారి 'స్వానుభవం'.

అంజలీ పిక్చర్సు సంస్థలో ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తూ దాదాపు పదకొండు చిత్రాలను(తెలుగు, అరవం, హిందీలలో కలిపి) నిర్మించిన అంజలీదేవిని ఈ సమయంలో నటిగా ప్రత్యేకంగా పరిచయం చేయవలసిన అవసరంలేదు !

1946 లో నటిగా జీవితాన్ని ప్రారంభించిన అంజలీదేవికి 1949 లో చిత్రనిర్మాణంలోని లోతుపాతులనుతెలిసికొనే అవకాశం తొలిసారిగాలభించింది. అశ్విని పిక్చర్సువారు 'మాయలమారి' నిర్మాణం తోడ్పడటమే అందుకు కారణమని అన్నారు. బహుశా, అదే క్షణంనుంచి మరోసంస్థను స్థాపించాలనే అభిప్రాయం కలిఉంటుంది.

ఏమయితేనేం, 1951 లో అంజలీ పిక్చర్సుకు అంకురార్పణ మహోత్సవం జరిగింది. శ్రీ ఆదినారాయణరావు, శ్రీమతి అంజలీదేవిగారలు సారధ్యంవహించారు.

తొలుత నిర్మించిన 'పరదేశి' ని ఉభయభాష (తమిళం, తెలుగు) ల్లో ప్రేక్షకులు చూచినా, లక్ష్మీదేవి మాత్రం చిన్నచూపే చూచింది.

తరువాత అనార్కలిఅవిర్భవించింది. అనతి కాలానికి అంజలీ పిక్చర్సును స్వర్ణమయం చేసేందుకు "సువర్ణసుందరి" అవతరించింది. బహుశా 'అంజలీ పిక్చర్సు' పేరు వాడవాడనా వినిపించటానికి ఇదే చిత్రం కారణం అయిఉండవచ్చు. తరువాత ఋణానుబంధం, తమిళంలో 'అదిత్తపిట్టు సెలిర్' తెలుగులో స్వర్ణమంజరి వచ్చాయి. తెలుగులో ఋణానుబంధం. స్వర్ణమంజరి చిత్రాలు ఒక అడుగు వెనుకనే ఉన్నమాట నిజం. ఇటీవలనే హిందీ లో నిర్మించబడిన ఫూలోంకి 'సేజ్'కూడా అంత ప్రోత్సాహకరంగా లేదన్నమాట అక్కడక్కడ వినిపిస్తున్నది చిత్రాలకు సంబంధించినంత వరకు ఇదీకథ

అంజలీదేవి నటిస్తున్న తెలుగు చిత్రాలీనాడు పెద్దగా లేవు కనుక, వారు తమ కాలంలో చాలావరకు చిత్రనిర్మాణానికే వినియోగిస్తున్నారు. నిర్మాతగా, నటిగా వారు విశేషమైన అనుభవం సంపాదించినా, వారి సంభాషణలో ఎక్కడా ఈ సత్యాన్ని వ్యక్తీకరించుకోరు. "నాకేమున్నదండీ! అంతా మావారే (ఆదినారాయణరావుగారు) చూస్తుంటారు నాకంటె వారికే ఆసక్తీ, అభిరుచీ, అనుభవమూ ఎక్కువ ఉన్నాయి" అంటారు.

"మరి మీ చిత్రాలకు అవసరమైన సాంకేతికుల ఎన్నికా, నటీనటుల ఎన్నికా మీకు తెలియకుండా జరుగుతుంటాయా ?"—మీ విలేఖరి ప్రశ్న

వదంతులను వినకండి
వదంతులను ప్రచారం చేయకండి

# జెన్‌సన్ & నికల్‌సన్

# రోబియాలాక్ పెయింట్లు

లోపలి, వెలుపలి పూతలకు అందరూ సహజంగా ఎన్నుకొనేవి.



దీనికి కారణాలేమంటారా...

**రోబియాలాక్ ప్లాస్టిక్ ఎమల్షన్**

1. తమ్ముల తిగేలు గాలిపే 120 రంగులలో లభ్యం కాగలదు.
2. ఒక గంటలోనే ఆరిపోతుంది.
3. కుంచె గుర్తు లేకుండా ధారాళంగా ప్రాకిపోతుంది.
4. ఎన్నిసార్లు కడిగినా, తుడిచినా రంగు తగ్గదు.

**రోబియాలాక్ సూపర్ - గ్లాస్**
**సింథెటిక్ ఎనామెల్**

1. రంగు తరగని, కాంతులీనే మెరుగు కలిగివున్న అనేక వర్ణాలలో లభ్యం కాగలదు.
2. పూతపూసిన తర్వాత మెరుస్తూ అందంగా వుంటుంది.
3. ఎలాంటి విపరీతాలకైనా పూర్తి రక్షణ నిస్తుంది.
4. త్వరగా ఆరుతుంది. పూత పూయడం అతి తేలిక.




జె & యన్ కోటింగ్స్‌ను అమ్మేది నాణ్యతే




వర్ణాల పూర్తి వివరాలకు, ఇతర వివరాలకు మీ సమీపంలోగల జె & యన్ డీలర్‌ను కలుసుకోండి.

BJ/JEN-25 TEL

# చిత్రనిర్మాతలుగా మహిళలు

"అలా జరగదనుకోండి. ఇలాంటి సందర్భాలు వచ్చినప్పుడు ఒకర్నొకరం సంప్రదించనిదే ఏ నిర్ణయాలూ చేయం" అంటారు శ్రీమతి అంజలీదేవి.

మొత్తంమీద మీ విలేఖరి శ్రీమతి అంజలీదేవితో మాట్లాడిన 40 నిమిషాల వ్యవధిలో—ఆమెకు చిత్రనిర్మాణంపట్ల ఒకరకమయిన అయిష్టత జనించిందనీ, నటిగా అనన్యమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించినా, ఇంకా నటనపైపే జీవితం, ఆమె మనస్సు మొగ్గుతున్నదని గ్రహించటం జరిగింది. ఇదేసత్యాన్ని బుజువుపరుస్తూ వారు చెప్పిన నాలుగు వాక్యాలు : "పిక్చరు ప్రారంభించామంటే 24 గంటలూ అదే ధ్యాసకదా! అదో పెద్ద 'వర్రీ'! తీరా ఇంత కష్టపడ్డాక ఏమవుతుందో, ఏమవుతుందోనని ఒకటే భయం. నటిగా అయితే ఈ బాదరబందీ లేనే లేవు. చక్కగా, ఆవేళ్టికి వెళ్లి, నటించటం— అంతే. మంచి వేషం వస్తే ఆ ఆనందాన్ని చెప్పటానికి వీల్లేదు. బాగా నటించిన రోజున మిగిలే తృప్తికి విలువ కూడా కట్టలేం" అంటారు.

ప్రస్తుతం శ్రీమతి అంజలీదేవి మూడు హిందీ చిత్రాలలోను తామే నిర్మిస్తున్న ఒక తెలుగుచిత్రంలోను నటిస్తున్నది.

ఇటీవలగా అంజలీ పిక్చర్సువారు నిర్మించిన చిత్రాలకు, పూర్తిగా దైవ సహకారం లభించటం లేదేమో ననిపిస్తుంది. శ్రీమతి అంజలీదేవి చెప్పినట్లు : "ఒక్కో చిత్రంలో డబ్బు వస్తుంది. మరో చిత్రంలో పోతుంది." ఈమాట వారికే వర్తించే అవకాశం లేకపోలేదు.

అంజలీదేవికి తెలుగువాళ్ల గౌరవ ప్రపత్తులు విశేషంగా ఉన్నాయి; ప్రేక్షకుల ఆదరాభిమానాలను కోకొల్లలుగా సంపాదించుకొన్నది. ఈ ఆదరాభిమానాలతో సరితూగగల చిత్రాన్నొకదానిని ఆమె నిర్మించగలిగితే, వారి కీర్తి ప్రతిష్ఠలు తప్పకుండా శాశ్వతమవుతాయి. చిత్రవీధిలో నాలుగు కాలాల పాటు వారి పేరు వినవస్తుంది. వాశిరాజు ప్రకాశం ★



కొత్తనటి, నర్తకి కల్యాణి

# సరాగమాల

ఈ ప్రపంచంలో మనుగడకు మానవుడు కోరేదేమిటి ? సుఖము, శాంతి. ఈ రెండు దేని వలన లభిస్తాయి ? నిర్వేదము వలన అని వేదాంతులనవచ్చు. కాని సాధారణులు గిరి, సంపదలు అంటే తప్పు పట్టలేము. ఉన్నవారనవచ్చు. 'డబ్బులో ధన కనక వస్తు వాహనాలలో సుఖమెక్కడ ఉందని' ఆ మాట ధనవంతుడంటే నిజమే. కాని అవి ఉంటే కష్టాలు తేలికవుతాయని లేని అనుభవించిన వారికే తెలుస్తుంది. ఇక ధనమూ, గుణమూ, సుఖమూ, విద్యా సంస్కారమూ ఇవన్నీ ఉన్న ఒక వ్యక్తి కోరుకునేదేమిటి ?

"మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యమూ. అదే
స్వర్గమూ"

ప్రేయసిగా కాదు. ప్రియునిగా కాదు. తోడుగా ఎందుకు ? శారీరక సుఖాల అవధులు చూడటానికి కాదు. శృంగార క్రీడల దేలటానికి కాదు.

"ఆశలు తీరని ఆవేశములో ఆశయాలలో
ఆవేదనలో
చీకటి మూసిన యేకాంతములో"

చరిత్రలలో వెచ్చని కౌగిలిలో అలరించటానికి కాదు. ఒకోసారి యేకాంతం భరించలేనంత బరువుగా ఉంటుంది. ఆశలు అడియాసలైనప్పుడు ఆశయాలు ఆవేదన పాలైనపుడు. అప్పుడు తోడుగా ఉండాలి.

తోడుగా ఉన్నవారు ప్రేమించక ఉండగలరా? లేరు. కాని ఆ ప్రేమ 'నా ప్రియునికి నేనే లోకమని' 'నా ప్రేయసికి నేనే లోకమని' భ్రమ కలిగించే ఇనుప పంజరం కాగూడదు. ఊపిరి తీసే ఉరిత్రాడు కాగూడదు. మరింకెందుకు ఆ ప్రేమ ? ఎటువంటిదా ప్రేమ ?

"నిన్ను నిన్నుగా ప్రేమించుటకు నీకోసమే
కన్నీరు నించుటకు
నేనున్నానని నిండుగ పలికే"

ప్రేమ అది. నిన్ను నిన్నుగానే ! ఆ మాటలో ఎంత అర్థమున్నదో అటువంటి ప్రేమను అనుభవించి పోగొట్టుకున్న వారికి తెలిసినంత తీవ్రంగా అనుభవిస్తున్న వారికే తెలియదు. అనుభవించని వారికీ తెలియదు. కాని ఆ అనుభవానికి ఆ భయం ఎంత స్వల్పమైన విలువమో !

"చెలిమియే కరువై వలపే అరుదై చెదరిన
హృదయమే శిలయైపోగా
నీ వ్యథ తెలిసి నీడగ నిలిచే
తోడొకరుండిన అదే భాగ్యము"

ఇటువంటి మహనీయ బంధం మహత్తర వ్యక్తితోనే సాధ్యము. కాని, కాని అటువంటి బంధం తెలుసుకొని పరిస్థితుల వలన పోగొట్టుకొన్న నిర్భాగ్యులకు కూడ కన్నీరు నించాలి.

ఇంతటి అందమైన పాట వ్రాసినది శ్రీశ్రీ. సప్త స్వరాలలో విషాదమను కొత్త స్వరం కలిపి పాడినది ఘంటసాల. చేతనున్న సితారను మార్చి హృదయ తంత్రులనే మృదువుగా వాద్యగోష్ఠిలో మీటినది జనార్దన్. రాగం జైజైవంతి రాగేశ్వరుడు రాజేశ్వరుడు. రికార్డునంబరు ఎన్ 69815.

రెండవ ప్రక్క "ఈ మౌనం ఈ బిడియం" మనే ఆరుద్ర ప్రియుగళ గీతం. సుశీ, ఘంటసాల. రచనలో ప్రత్యేకత "ఎంత యెంత యెడమైతే అంత తీపి కలయిక." వాద్య రచనలో ప్రత్యేకత శైలుకుండి శబ్దాలు పాటను అనుసరించిన విధానం పాడటంలో విశేషం ఘంటసాల కంఠంలో యువత. సుశీల స్వరంలో పలికిన ప్రణయ భావ గీతిక.

ఇంత చక్కని ఈ రెండు పాటలు అంతగా ప్రజాదరణ పొందక పోవటానికి కారణం ఇంత చక్కని సినిమా అనిపిస్తే కాదని మనసుకి కుదట పర్చుకొంది. ★

# రంగాపలోకనం

క్షత్రియ...(illegible) పిక్చర్స్ వారి తొలి చిత్రం క్రిందటి నెల, ...(illegible), పట్టణం ...(illegible), సత్యా స్టూడియోలో ప్రారంభోత్సవం జరుపుకొన్నది. నిర్మాతలు విజయునగరం సుప్రసిద్ధులైన త్రివిక్రమరావు, రంగారావుల బాటు వారికి శుభాశీస్సులు అందజేయటానికి పెద్దలు హాజరైనారు. వారిలో ప్రత్యగాత్మ, డి. యల్. నారాయణ, పి. ఎస్. రామకృష్ణరావు, సి. పుల్లయ్య, ప్రభాకరరెడ్డి, జి. ఎస్. ఆర్. స్వామి ముఖ్యులు. ఈ చిత్రానికి వివిధ రంగాలతో సంబంధించిన పి. ఎస్. రావు, ఆరుద్ర, బాలయ్య, కాంతారావు, శ్యామలరావులుకూడా వచ్చారు.

వారి వేసిన సెట్టు కొండ గుహలో కాళికా విగ్రహాన్ని భీకరంగా నిరూపిస్తున్నది. కంటికి ఆ తాళ్ళు రప్పలు అట్టముక్కలుగా తెలిసినా సినిమాలో, దత్తు కెమెరా చాకచక్యం వలన నమ్మదగ్గవిగానే కనపడతాయన్న నమ్మకం నాకు ఉన్నది. "మర్మయోగి"లో అతి రమ్యంగా దత్తు చిత్రీకరించిన ఎడవ దృశ్యాల వలన కలిగిన నమ్మకం అది. ఈ ముహూర్తం సందర్భం ఆరా ఒక యోగ్యం, మొదటిషాట్‌కి ముందు కాళికాపాత్రం విగ్రహం ముందు ఒక పురోహితుడు పుస్తకంలోకి చూస్తూ చూస్తూ పరిపడం, ఆ ప్రక్కన ఉన్న అతని హితుడు "సరే" అన్న దగ్గర బిగ్గరగా అందుకొంటుండడం ఒక యోగ్యం. ఎందుకో గాని ఆ రోజంతా పుస్తకం చూసి పురోహితుడు మంత్రాలు చదవటం గుర్తుకువచ్చి అనవసరంగా ఉష్ణోగ్రతలా నవ్వు రావటం! నిజానికి ఈ కాలానికి విచిత్రమైనది అందులో యేమున్నది కనుక !

ఇంతకూ ఆ చిత్రంలో గల తారలు రాజసులోచన, సత్యనారాయణ, బాలకృష్ణ, సంగీతం పెండ్యాల, రచన ఆరుద్ర నృత్యం పసుమర్తి.

సెట్ మీద ప్రభాకరరెడ్డి కూడ ఉన్నాడు. మొదట్లో ఒక్కో సెషన్ వేస్తూ వేసినపుడు పిల్లైన పోటంతా ప్రభాకరరెడ్డి అని వ్రాసే వాడిని. కాని ఈనాటి డబుల్ సాత్త్విక వేషాలు కూడ వేయబూనటంతో ఆ పన్నగడ పనికి రావటం లేదు.

ఈ ప్రభాకరుని గురించి మరొక విశేషం. ఒక చిత్రంలో యేదో నాటక వేషం వేస్తున్నాడో ఇంతకు ముందు ఒక కటువు ద్వారా తెలుసుకొనేవాడిని.

# రంగావలోకనం

ఆ చిత్రం ఆఫీసులో ప్రభాకరరెడ్డిని కలుసుకోవటం వల్లగా చూస్తే అది అమ్మో, విలనీయం. వల్లగా నవ్వితే మంచివాడి వేషం. నిజం చెప్పాలంటే నేను ప్రభాకరరెడ్డి నవ్వు చూసింది మొట్ట మొదట రఘురాం ఆఫీసులో "కలవారి కోడలు" నిర్మాణ సమయంలో.

జయ-భేరివారి పు హూర్త సమయంలో తీసిన ఫోటో ఉంది కాని దాని బట్టి అందులో చేసేది విలనీయమో కాదో నిర్ణయించలేక పోయాను. తీరా ఇంటికి వచ్చి చూస్తే వాళ్ళు ఇంత వరకు ఇచ్చిన పేర్లలో ఇతని పేరు లేదు.

* * *

ఆరేళ్ళ క్రిందటనుకుంటాను. "గంగా గౌరీ సంవాదం" విడుదలయింది చక్కని పౌరాణిక చిత్రం నిర్మించి నాలుగు డబ్బులు - చేసుకుందామన్న విజయగోపాల్ వారి సదాశయం విఫలమయింది.

నేనీ చిత్రాన్ని నాలుగైదు సార్లు చూశాను. అంత నచ్చింది నాకు. సంగీతంలోనే కాదు, ఛాయ గ్రహణంలోనే కాదు, నటీనటుల ప్రభావ ప్రకటన లోనే కాదు అన్నిటా నాకు అంత అత్యుత్తమంగా కనిపించింది కాని ఆ చిత్రం అంత అన్యాయంగా పరాజయం పొందిన పిమ్మట నా దృష్టిలోనే కొంత లోపం ఉండి ఉండవచ్చనే అనుమానం కూడా కలిగింది. కాని ఆ చిత్రంలో ఇవి చెప్పుకో దగ్గ వెలుగులంటే కాదనే వారెవరూ ఉండరనే నా నమ్మకం. ఆంధ్రదేశంలో చిత్ర ఛాయా గ్రహణం నేర్పటానికి యెప్పుడైనా ఒక వ్యవస్థ అంటూ యేర్పడితే ప్రతి అడుగూ ఒక పాఠ్య భాగంగా యెన్నదగిన వి. ఎన్. రెడ్డి ఛాయా గ్రహణం : అతి సహజంగా, కైలాసంలోనైతేనేం, బెస్తవాళ్ళ పూరి గుడిసెలలోనైతేనేం, రంగాలంకరణ జేసిన కళాదర్శకుని నైపుణ్యం; "భలే భలే పెళ్ళి జరుగదు మళ్ళి" అన్న పాటకు సంగీత కల్పనా, నృత్య కల్పనా, భువిలో బెస్తల జానపదం; దివిలో రంభా భరతం; ఇందులోని అందులోకి అందులోంచి అవలీలగా, లీలగా మారగల్గిన వాద్యగోష్ఠి; అమాయకురాలైన గంగ ఉన్నీ తెలిసిన గౌరిగా కృష్ణకుమారి జానకిల నటన.

పై అన్నిటికీ యే మాత్రం తీసిపోనిది శివునిగా నారాయణరావు చూపిన అతి సహజ నటన. ఏమైనా అంతకన్నా యెంతో విజయవంత మవ వలసిన చిత్రం "గంగా గౌరీ సంవాదం"

ఆ తరువాత యెందుకో ఆంధ్ర చిత్ర పరిశ్రమ నారాయణరావును మరచి పోయింది. కారణం యెవరికీ తెలియదు. అతనికి నటన రాదని కాని, వచ్చిన దానిలో యేదో లోపమున్నదని కాని అతని బద్ధవైరులైన వారూ అనరు. కారణం. అనుకోవటానికి ఒక్కటే ఉన్నది. అంతకు ముందతను నటించిన రెండు మూడు చిత్రాలు (మంజరి, మానవతి, ఇత్యాదులు) విజయవంతం కాలేదు. అంతమాత్రాన అతన్ని విస్మరించటం యెంత వరకు న్యాయం ? "నిరుపేదలు" "ఇద్దరు పెళ్ళాలు" ఫెయిలయినంత మాత్రాన ఇద్దరు రావు గారలను నాయకులుగా నిలపటం మానివేసి ఉంటే యెంత ఘోరం జరిగి ఉండేది ? ఒక చిత్రం పరాజయం పొందినంత మాత్రాన ఆ చిత్రంలో ఉన్న వారంతా ఆ లోపానికి కారణభూతు లవుతారా ? ఒక చిత్రం శతదినోత్సవం చేసుకున్నంత మాత్రాన అందరూ ఆ ప్రతిభను పాలువంచుకో దగుతారా ! రెండూ కావు. విజయానికి కాని, పరాజయానికి కారకు లెవరో నిర్ణయించుకొని దానికి తగినట్లుగా ప్రోత్సాహమో దానికి వ్యతిరేకమో చేయటంలోనే అర్థమున్నది.

ఇంతకూ చెప్ప వచ్చే దేమిటంటే, ఆలయావారి సరికొత్త చిత్రంలో నారాయణరావు చిన్నివేషం, నిర్మాత దర్శకులైన ఎం. కె. రెడ్డి, హేమాంబరధర రావు పట్టుదల వలన, వేస్తున్నారు. ఆరేళ్ళ తరువాత ముఖానికి రంగు వేసుకుంటే యెంత చిత్రమైన అనుభూతి నారాయణరావుకు కలిగిందో . ఇంతగా కృషి చేసిన రంగం ఇన్ని రోజులు చిన్న చూపు చూసిందే అని బాధ. ఇప్పటికైనా కనుసైగ చేసింది కదా అని సంతోషం. ఎవరో పాడినట్లు 'అదియొకగాధ, తీయనిబాధ.'

ఫిల్మాలయా ముఖర్జీ తీసిన చిత్రాలు (హం హిందూస్తానీ తప్ప) నాకేవీ నచ్చలేదు. కాని ఆయన చేసిన పని ఒకటి నాకు బాగా నచ్చింది. ఒకప్పుడు సుప్రసిద్ధ తారలై ఈ నాడు అకారణంగా తెరమరుగైన వారికి మళ్ళీ చిన్నదో చిటికెదో వేషం ఇవ్వటం. సురేంద్రకూ, సులోచనకు ఇటువంటి వేషాలే ఒక చిత్రంలో ఇచ్చినట్లు వార్త. మన తెలుగు వాళ్ళు కూడా అటువంటి సదుద్దేశంతో బెజవాడ రాజరత్నం, సురభి కమల, కాంచనమాల, ప్రభాకరరావు, రాజేశ్వరి, మొదలైన వారికి వేషాలిస్తే బాగుండును. వీరందరు చిల్లర వాళ్ళని ఈ నాటి ప్రేక్షకులనుకుంటారేమో ! ఎంతమాత్రం కాదు. హీరో, హీరోయిను వేషాలు, రెండవ నాయిక వేషాలూ వేసిన వాడే. ముందు చూపుతో ఈ నాడు యెన్నో ప్రయోగాలు చేస్తున్న నవదర్శకులకు ఇది ఒక వినతి. ★

వి. ఎ. కె. రంగారావు.

## వరద బాధితులకు శ్రీరామారావు విరాళం

విజయవాడ వరదబాధితులకు శ్రీ నందమూరి తారక రామారావుగారు తమ ఎన్. టి. రామారావు 'ట్రస్టు' ద్వారా రు. 10,000/- విరాళం ఇస్తున్నారు. ఈ మొత్తం శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిగారికి అందచేస్తారు.

ఈ సందర్భంలోనే శ్రీ రామారావుగారు ఈనెల 25వ తేదీన తమకు జరగనున్న సన్మానించటం భావ్యం కాదని ఆ కార్యక్రమాన్ని తదనుగుణంగా మార్చుకుంటున్నారు.

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press: 6 & 7 Thambuchetty Street Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



సముద్రతీరాన ఒకనాడు...! (ఫొటో: డి. యం. మల్న)

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



వసంత

అందమైన ముఖ వర్చస్సునకు

ఎక్కువ కాలం నిలిచే పరిమళమునకు

# రెమి

ట్యాల్కమ్ పౌడరు

CRITERION RP. 433